Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 32 • 12-8-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



● అక్రమార్జన తన హక్కుగా భావించిన...

# జగన్ పాపం పండింది!

జగన్ కథ క్రిమినల్ కేసుల తీరం చేరింది. జగత ఐదారేళ్లుగా జగన్ అక్రమ ఆర్జన మీద ఎన్ని కథలు చదివామో, ఎన్ని పురాణాలు విన్నామో, ఎన్ని విమర్శలతో చెవి తుప్పు వదల గొట్టుకొన్నామో, ఎన్ని సమర్ధనలతో ఆశ్చర్యపడ్డామో లెక్కే లేదు. రాష్ట్రంలో ప్రతిపక్షాలకు, పత్రికలకు ఇన్నేళ్లుగా అదొక కాలక్షేపం. ఏ వార్తా దొరకకుంటే, జగన్‌కు సంబంధించిన ఒక కొత్త అక్రమాన్ని పతాక శీర్షికలెక్కించే అలవాటు చేసుకొన్నాయి పత్రికలు. చంద్రబాబుకైతే మైక్ పట్టుకొంటే జగన్ తప్ప వేరొకరు గుర్తుకు రారు. జగన్ కోసం కాంగ్రెస్ ముఖ్య మంత్రులతో రహస్య లాలూచీ రాజకీయం కూడా చేశాడంటే, రాష్ట్ర రాజకీయాలలో జగన్ అక్రమ ఆస్తుల వ్యవహారం ఎంతగా నర నరంలో జీర్ణించు కొని పోయిందీ అర్ధం చేసుకోవచ్చు.

ఈ కథకు సిబిఐ దర్యాప్తనే ముగింపు ఇచ్చింది హైకోర్టు. కాంగ్రెస్ మంత్రి శంకరరావు వ్రాసిన లేఖను హైకోర్టు సుమోటోగా ప్రజా ప్రయోజన వ్యాజ్యంగా స్వీకరించిన రోజే, పరిణామాలు ఇట్లా వుండబోతాయని అందరూ వూహించారు. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా జస్టిస్ కపాడియ వచ్చిన నాటి నుంచి న్యాయస్థానాలు రాజకీయ అవినీతి పట్ల కఠినంగా వ్యవహరిస్తున్నాయి. అక్రమార్జనపరుల భరతం పడుతున్నాయి. ఆ క్రమం లోనిదే ఇది కూడా.

## ఒక్క సిబిఐతో ఆగదు

హైకోర్టు తీర్పు ప్రభావం చాలా విస్తృతమైనది. తీర్పు ప్రకారం సిబిఐ దర్యాప్తు చేయాలి. కానీ జగన్ అక్రమ ఆస్తుల విశ్వరూపం దేశ విదేశాలకు, పలురకాల చట్ట ఉల్లంఘనలకు విస్తరించినందువల్ల

కొరవ 14వ పేజీలో





# ఆ దేశాలకూ అరిష్టం

అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ వంటి దేశాలను చూస్తే ప్రపంచ ప్రజలందరికీ అలివిమాలిన అభిమానం. అభివృద్ధికి ఆనవాళ్ళుగా, సుఖప్రదమైన జీవితాలకు చిరునామాగా, సిరిసంపదలకు నెలవుగా, విజ్ఞానానికి వేదికలుగా, శాస్త్ర ప్రగతికి పుట్టిల్లుగా, పౌర జీవనంలో క్రమశిక్షణకు సంకేతాలుగా, నాగరికతకు నిలువుటద్దంగా భావిస్తూ వుంటారు వాటిని. ఎన్ని కష్టాలైనా పడి ఆ దేశాలకు వెళ్ళాలని, అక్కడే స్థిరపడాలని కలలు కంటూ వుంటారు. ఆయా దేశాలలో నివసించే వారిని చూసి అసూయ చెందుతూ వుంటారు. పెట్టుబడిదారీ వ్యవస్థ వల్లనే ఆ దేశాలు అంతగా ప్రగతి సాధించాయని, సామ్యవాదం, కమ్యూనిజం సిద్ధాంతాలను పట్టుకొని వూగులాడే భారత్, రష్యా, చైనా వంటి దేశాలు అభివృద్ధిలో అడుగంటి పోయాయని సూత్రీకరిస్తూ వుంటారు. కాపిటలిజం ఒక్కటే ఈ ప్రపంచాన్ని ఆకలి నుంచి, పేదరికం నుంచి ప్రపంచ ప్రజలకు విముక్తి కల్గిస్తుందని భావించడమూ అలవాటై పోయింది.

కానీ పాశ్చాత్య నాగరికతకు ప్రధాన సంకేతం వంటి ఇంగ్లాండ్ దేశ రాజధాని లండన్ మహా నగరంలో గత వారం రోజులుగా జరుగుతున్న గృహ దహనాలు, లూటీలు, వీధి పోరాటాలు, అల్లర్లను చూస్తే ఈ భావనలెంత భ్రమలో అర్థమై పోతుంది. లండన్ శివార్లలో ఒక నల్ల జాతీయుడిని పోలీసులు కాల్చి చంపడాన్ని నిరసిస్తూ వేలాది మంది పౌరులు వీధులలోకి వచ్చారు. వారిని అణచడానికి పోలీసు ప్రయత్నం చేసే కొద్దీ, అల్లర్లు మరింతగా విస్తరిస్తున్నాయి. ఇదే అవకాశంగా అంగళ్ల మీద పడి లూటీలు చేస్తున్నారు జనం. ముసుగులు ధరించిన యువకులు షాపింగ్ కాంప్లెక్స్ తలుపులు పగలగొట్టి, కనపడిన ప్రతి వస్తువూ చేత పట్టుకొని పోతున్నారు. అడ్డు వచ్చే పోలీసుల మీద రాళ్ళు రువ్వి, వారి జీపులు తగుల బెడుతున్నారు. పెద్ద పెద్ద భవంతులను సైతం దహనం చేస్తున్నారు.

పౌరజీవితంలో క్రమశిక్షణకు మారుపేరైన లండన్ నగరంలో ఈ పరిస్థితి ఏర్పడడం విచిత్రమైన విషయం. దాన్ని అదుపు చేయలేక ఇంగ్లండ్ ప్రధాని కామెరూన్ వంటి నేతలు వ్యక్తం చేస్తున్న నిస్సహాయత, నిర్వేదాలు మరింత ఆశ్చర్యం కల్గిస్తున్నాయి. యువతరంలోని బాధ్యతారాహిత్యం, నైతిక ప్రమాణాల పతనం, పిల్లల పెంపకంలో తల్లిదండ్రుల అపసవ్యత వంటి కారణాల వల్లనే లండన్ నగరం ఈ దుస్థితిని ఎదుర్కొంటుందని ఆవేదన చెందాడు కామెరూన్.

అయితే, రోగం ఒక దగ్గర వుంటే మందు ఇంకొక దగ్గర పూయడం వంటిది బ్రిటీష్ ప్రధాని ఆవేదన. లండన్ నగరం తగలబడి పోవడానికి ప్రధాన కారణం పేద ధనిక వర్గాల మధ్య పెరిగి పోతున్న అంతరం. సమాజంలో కొద్ది శాతం మంది అపర కుబేరులుగా మారి విలాసవంతమైన జీవితాలనుభవిస్తుంటే, అధిక శాతం ప్రజలు నిరుద్యోగ సమస్యతో, చాలీచాలని జీతాలతో, ఆర్థిక కష్టాలతో అలమటిస్తున్నారు. విద్య, ఆరోగ్యం, ఉపాధి వంటి రంగాలలో ప్రభుత్వం అమలు చేసే సంక్షేమ పథకాలు నానాటికీ క్షీణించి పోతున్నాయి. దానితో సగటు మనిషి కనీసపాటి జీవన ప్రమాణాలతో బ్రతకడం దుర్లభమై పోతున్నది. ఒక్క లండన్‌లోనే కాదు, అభివృద్ధి చెందిన దేశాలన్నిటిలో లక్షలాది మంది యువతీయువకులు ఉద్యోగాలు లేక వీధుల పాలౌతున్నారు. అమెరికా, ఫ్రాన్స్, ఇటలీ వంటి దేశాలన్నిటిలో ఈ సమస్య వికృత రూపం దాలుస్తున్నది. ఆ అసహనాన్ని, ఆ ఆక్రోశాన్ని, ఆ దుర్భలత్వాన్ని అల్లర్ల రూపంలో వ్యక్తం చేస్తున్నది అక్కడి యువత.

జనశక్తి రైతు

అరబ్ దేశాలలో కూడా ఇంచుమించు ఇదే సామాజిక, ఆర్థిక పరిస్థితులు నెలకొని వున్నాయి. ఈజిప్ట్ నుంచి సిరియా వరకు పది పన్నెండు దేశాలలో ప్రజలు తమ దేశాధినేతల మీద తిరుగుబాట్లు ప్రకటిస్తున్నారు. అయితే వారు ఎంతో సంయమనంతో, నిగ్రహంతో, శాంతియుతంగా వీధులలో నిరసన ప్రదర్శనలు చేసి, ప్రభుత్వాల మీద ఒత్తిడి పెంచుతుంటే, నాగరికతకు మారుపేరైన ఐరోపా దేశాలలో ప్రజలు హింసను, విధ్వంసాన్ని తమ నిరసన మార్గంగా ఎంచుకొంటున్నారు. సామాజిక, రాజకీయ శాస్త్రవేత్తలు, నేతలు తప్పక గమనించవలసిన వ్యత్యాసం ఇది.

ఎక్కడ ఆకలి వుంటే అక్కడ తిరుగుబాటు వుంటుంది. ఎక్కడ జీవన స్థితిగతులలో తేడా వుంటే అక్కడ విప్లవాలు పుట్టుకొని వస్తాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ, తన తోకను తానే మ్రింగి వేస్తుందని కారల్ మార్క్స్ చెప్పిన మాట ఈ రోజు ఐరోపా దేశాలలో మన కళ్ల ముందు కన్పిస్తున్నది. ఈ నిజాన్ని గ్రహించి, తప్పులు సరిదిద్దుకొంటే పాశ్చాత్య దేశాలు తమ అస్తిత్వాన్ని నిలుపుకోగలుగుతాయి. దాన్ని కప్పి పెట్టి, కుంటి సాకులు వెతికితే క్యాపిటలిజం పునాదులు కుప్ప కూలిపోతాయి.

## జనవాణి

### ఆనం సోదరులు విశ్వాస ఘాతకులు!

ఆనం వివేకానందరెడ్డి అన్నిసార్లు ఎమ్మెల్యే కావడానికి, రామనారాయణ రెడ్డి మంత్రి కావడానికి వైఎస్.రాజశేఖర్‌రెడ్డే కారకుడు. అది మరచి వివేకానంద రెడ్డి నోటికొచ్చినట్లు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని మాట్లాడడం తగనుగాక తగదు. రాజశేఖర్‌రెడ్డి వెనుక తోకలా తిరిగిన రోజులు, మేయర్ పులిమి శైలజను ఆయన సహకారంతో కుర్చీ నుంచి దించి భానుశ్రీని ఎక్కించిన విషయాలు వివేకానంద రెడ్డి మరువవచ్చు. జనం మరచిపోలేదు. అక్రమార్జనతో విపరీతంగా ఆస్తులు వెనకేసుకొన్న ఆనం సోదరులకు ప్రజలు తగిన బుద్ధి చెబుతారు.

సి.సుజాత — కర్నూలు

### మరపురాని మహిళామణి!

సింహపురి విశిష్ట వ్యక్తుల్లో పొణకా కనకమ్మ గారిది ఉన్నతస్థానం. దేశభక్తి, మహిళా విద్య, సంఘసేవా రంగాల్లో వెలకట్టలేని భూమిక ఆమెది. ఐదు దశాబ్దాల తర్వాత ఆమె స్వీయచరిత్ర 'కనక పుష్యరాగం'గా వెలుగు చూడడం, దానికి కాళిదాసు పురుషోత్తం కారకుడు కావడం సంతోషించతగ్గ పరిణామం. కస్తూరిదేవి విద్యాసంస్థల్లో చదువుకొన్న పూర్వ విద్యార్థిని ఎం.ఎస్.వరలక్ష్మమ్మ చేసిన పుస్తకసమీక్షలో ఆనాటి బుడిబుడి నడకల పాఠశాల సంగతులు ఆకట్టుకొన్నాయి. విద్యాలయాన్ని సొంత బిడ్డకన్నా మిన్నగా ప్రేమించి, పోషించిన కనకమ్మను మేనేజ్‌మెంట్ నుండి నిర్ధాక్షిణ్యంగా తొలగించి ఆత్మక్షోభకు గురిచేసిన పెత్తందార్లను ఇదేమి న్యాయమని ధైర్యంగా ప్రశ్నించి నిలదీసి, స్త్రీజాతి ఆత్మగౌరవాన్ని నిలబెట్టిన వరలక్ష్మమ్మ అభినందనీయురాలు.

ఎం.రామమూర్తి — విశాఖపట్నం

### టిబి హాస్పిటల్‌ను దురాక్రమించారు!

ఎంతో సేవాభావం, చరిత్రగల నెల్లూరు టిబి ఆసుపత్రి ప్రాంగణంలో ముఖ్యమైన ప్రభుత్వ కార్యాలయాలైన కలక్టరేట్, జడ్పీ ఆఫీసు, కార్పొరేషన్ కార్యాలయాలు కొలువుదీరాయి. అయితే ఏ ఆఫీసును కూడా ప్రధాన రహదారికి ముఖం చూపక చాటున నిర్మించారు. కార్పొరేషన్ కార్యాలయానికి మెయిన్ రోడ్డు నుంచి అర కిలోమీటరు నడచి వెళ్లాలి. ఈ ఆఫీసును నిర్మాణపరంగా అద్భుతంగా కట్టారు. జడ్పీ ఆఫీసుకు ఉత్తరం వైపు ఎలివేషన్ అందగించలేదు. కలక్టరేటును ప్రధాన రహదారి వైపు పదిమందికి కనబడేలా కడితే బాగుంటుంది. అదేవిధంగా ఏదో ఒక వైపు టిబి ఆసుపత్రిని కూడా వుంచ మనవి.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

### చెట్లను నరకకండి!

నెల్లూరుకు ముఖ్యమంత్రి రాక సందర్భంగా పొదలకూరురోడ్డులో ఏళ్ల

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

15-8-1941
పేజీలు : 10 వెల: అణా

### జమ్మెలపాలెపు జాతర

మూడేళ్లపాటు జాతర వివాదాలు కోర్టుకెక్కి సాంఘిక బహిష్కారాలు, పరాయి గ్రామాల వారిచేత చాకిరి చేయించడం ఇంకా సాగుతున్నదంటే విన్నవారు నవ్విపోతారు.

గ్రామ పెద్దల్లారా! ఇకనైనా నలుగురు ఒక రేవుకొచ్చి ఈ చిన్న వివాదాలను పరిష్కరించండయ్యా!

### గూడూరు బోర్డు

కలరా తీవ్రంగా వుందని టవునంతా దద్దరిల్లిపోయిన భయంకర దినాల్లో గూడా మురుగుకాల్వల మాట ఎత్తుకొన్నట్లు లేదే ఏమిటండీ ఆ ధీమా!

### నెల్లూరు హరిశ్చంద్ర

అనుకున్న వేళకు గాకపోయినా ఆ రాత్రి ఘడియలుండగానే(9వ తేది) ప్రారంభించారులెండి!

రోదసీ కుహరమున సూదిమోపను సందు లేకుండా జనసమ్మర్దము–

విశ్వామిత్రునికి జ్వరమట. ఆ పాత్రధారణం గూడా వీరబాహుడే నెత్తిన గట్టుకొని అనుభవించాడు మస్తుగా. పులిపాటివారి పాటకచ్చేరి పేరిగాని కోర్టును జ్ఞప్తికి తెచ్చింది. శోభనాచలవారు ఈ లీలావతిని బైటరంగాలకు పంపకుంటేనే మెరుగు ప్రహ్లాద చిత్రం ఆడిపొయ్యేదాకా.

### పెద్ద ఆసుపత్రి

పెద్ద డాక్టరు చేర్చుకొమ్మన్న రోగులను గూడా తంటాలు పెడతాడటనే! ఎవరా అడ్మిషన్ డాక్టర్! ఏడిపించే దానికంటే కారణాలేమన్నా వుంటే చెప్పరాదా!

## 50 ఏళ్ల క్రితం ఈవారం

11-8-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు
### కలరా వ్యాప్తి

కనిగిరి, కందుకూరు, వెంకటగిరి తాలుకాలను సందర్శించిన కలరా వ్యాధి నెల్లూరు తాలుకాలో ప్రవేశించింది. ఈ వారంలో మనుబోలు చెర్లోపల్లిలో ముగ్గురుకు వ్యాపించి ఇరువురు మరణించారు. గురువిందపూడిలో ఒక్కరికి సోకిందట.

వ్యాధి నిరోధానికి ఆరోగ్య శాఖ సకాలంలో సరైన చర్యలు జరపడం సంతోషం.

జిల్లాలో మసూచి యెచ్చటా రిపోర్టుకాలేదు.

### విద్యుచ్ఛక్తి సరఫరా

టవున్‌లో విద్యుచ్ఛక్తి సరఫరా మితిమీరిన అబందర స్థితిలో పడిపోయి, పౌరులను వేధిస్తున్నది. రోజూ సరఫరా ఆగిపోవడం, ప్రజలు, వ్యాపార, పారిశ్రామిక సంస్థలు విపరీత కష్టనష్టాలకు, అసౌకర్యానికి గురి కావడం జరుగుతున్నది. పాత వైరింగు, గజిబిజిగా వున్న కనెక్షన్లు ఈ దుస్థితికి కారణం. ఈ లోపాన్ని సవరించే దిక్కు కనపడడంలేదు. విద్యుచ్ఛక్తి శాఖ ఉన్నతాధికారులు తక్షణం ఈ విషయంలో శ్రద్ధ వహించి పౌరులకు సక్రమంగా విద్యుత్ సరఫరా జరుగునట్లు చూడవలెను.

### కాలేజి యూనియన్

విఆర్ కాలేజి స్టూడెంట్స్ యూనియన్ ఎన్నికలలో యువజన కాంగ్రెస్ ప్రతినిధులు జి.వీరాస్వామి నాయుడు అధ్యక్షునిగా, పి.వి.సుబ్బారెడ్డి కార్యదర్శిగా ఎన్నికైనారు.

# నెల్లూరు ముచ్చట్లు

## పి.ఏలను ఆరాతీసిన వివేకా!

కలెక్షన్ కింగ్‌లుగా వివేకా పి.ఏలు శీర్షికపేరిట 'జమీన్‌రైతు'లో వచ్చిన వార్త విషయమై రూరల్ ఎమ్మెల్యే వివేకానంద రెడ్డి తన పి.ఏలను ఆరాతీసినట్లు తెలిసింది. వీరిని తనదైన ధోరణిలో దుర్భాషలాడగా ఒక్కొక్కరు ఒక్కో సాకు చెప్పి తప్పించుకొన్నారట. ఒక పి.ఏ విపరీతంగా గడించిన విషయాన్ని మిగతా ఇద్దరు పి.ఏలు తమ బాస్ దృష్టికి తీసుకెళ్లారట. బాగుంది... పి.ఏలతో వివేకా పంచాయితీ!

## సరస్వతి నిధికి రత్నంసార్ చేయూత!

హాస్టళ్లలో చదువుకొనే పిల్లలకు కార్పొరేట్ విద్యనందించను జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ప్రవేశపెట్టిన 'సరస్వతి నిధి'కి రత్నం విద్యాసంస్థల అధినేత కె.వి.రత్నం లక్ష రూపాయల విరాళమందించారు. ఈ మొత్తాన్ని కలక్టర్ బంగళాకు వెళ్లి స్వయంగా అందజేశారాయన. రత్నంసార్ చేయి మంచిదంటారు. కలెక్టర్ సంకల్పం కూడా మంచిది కాబట్టి ఈ పథకానికి ఆయన కోరుకొంటున్నట్లు కోటి రూపాయల మూలనిధి సమకూరుతుందని ఆకాంక్షిద్దాం.

## ఆదాలకు ఘనకీర్తి!

సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి రాజకీయాల్లో రాకమునుపు ఆదాల చారిటబుల్ ట్రస్ట్ పేరిట ఎన్నో దాతృత్వ కార్యక్రమాలు చేపట్టారు. ఈ కార్యక్రమాలన్నీ ఒక ఎత్తు ఈ వారంలో కస్తూరిబా కళాక్షేత్రంలో నాలుగు రోజుల పాటు జరిపిన 'మువ్వల రవళి' కార్యక్రమం మరో ఎత్తుగా చెప్పొచ్చు. వ్యవధి తక్కువవున్నా కూచిపూడి నృత్య పోటీలకు తరలివచ్చిన కళాకారిణులు ఇచ్చిన ప్రదర్శనలు, శంకరాభరణం మంజు భార్గవి సమన్వయం ఆదాల ప్రభాకర్ రెడ్డి, ఆయన సోదరులు రాఘవరెడ్డి, మురళీ కృష్ణారెడ్డిల దాతృత్వంతో వారు గతంలో చేపట్టిన కార్యక్రమాలకన్నా ఎక్కువ ఘనకీర్తి లభించిందనాలి.

## వివేకాను పిలవని ఆదాల

నెల్లూరులో ఏ కార్యక్రమం జరిగినా అందులో రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి తప్పనిసరిగా పాల్గొంటారు. కస్తూరిబా కళాక్షేత్రంలో నాలుగు రోజులపాటు సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి నిర్వహించిన 'మువ్వలరవళి' కార్యక్రమంలో వివేకానందరెడ్డి పాల్గొనలేదు. ఆహ్వానపత్రంలోనూ వివేకానందరెడ్డి పేరు ముద్రించలేదు. తన అగ్రజుని ఈ కార్యక్రమానికి పిలకపోయినా ప్రారంభ, ముగింపు ఉత్సవాలకు ఆర్థిక మంత్రి రామనారాయణ రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేయడం విశేషంగా చెప్పొచ్చు.

## బ్యాంకుల సమ్మెతో ఇబ్బంది!

వివిధ ప్రభుత్వ బ్యాంకుల్లోని ఉద్యోగులు ఆగష్టు 5వ తేదీ సమ్మె చేయడంతో ఖాతాదారులు అల్లాడిపోయారు. సమ్మెకు ముందు పెద్ద ప్రచారం లేకపోవడంతో అత్యవసరంగా డబ్బు డ్రా చేయను యధాతథంగా బ్యాంకులకు వెళ్లిన ఖాతాదారులు భలే ఇబ్బందులు పడ్డారు. 12 గంటల కల్లా ఏటిఎంలు పనిచేయడం మానేశాయి. జిల్లాలో 250కి పైగా బ్యాంకుల శాఖలు మూత వల్ల 200 కోట్ల రూపాయల లావాదేవీలు నిలచిపోయాయి.

## ఆటోడ్రైవర్ల ముసుగులో దొంగలు

నెల్లూరు నగరంలో ఇప్పటికే రకరకాలుగా జరుగుతున్న దొంగతనాలు చాలవన్నట్లు కొందరు ఆటోడ్రైవర్ల ముసుగులో దొంగతనాలు చేస్తున్నారు. ఆటోవాలాలుగా నటిస్తూ నగానట్రా ధరించి ఆటోలలో ఎక్కిన మహిళలను శివారు ప్రాంతాలకు తీసుకెళ్లి మారణాయుధాలు చూపించి దోచుకొనే ముఠా సభ్యులు ముగ్గురిని నెల్లూరు సిసిఎస్ పోలీసులు అదుపులోకి తీసుకొన్నారు. వీరి వద్ద నుంచి 43 సవర్ల బంగారు నగలు స్వాధీనం చేసుకొన్నారు. కోవూరు గుమ్మళ్లదిబ్బకు చెందిన నల్లబోతు మహేష్, నల్లబోతు శ్రీను, కావలికి చెందిన శేషాద్రి వాసు మాజీ నేరస్తులు. శిక్షపడినా మార్పు రాకపోగా ఆటోడ్రైవర్ల ముసుగులో దొంగతనాలకు పాల్పడుతూ కాలం కలసిరాక పోలీసుల చేత చిక్కారు.

## బాలాజీనగర్ వాసుల్లో చైతన్యం!

నెల్లూరు బాలాజీనగర్‌లో పగలు రాత్రి తేడా లేకుండా దొంగతనాలు జరుగుతున్నాయి. ప్రజల ఫిర్యాదులను పోలీసులు పెద్దగా పట్టించుకోవడం లేదు. దీన్ని నిరసిస్తూ 8వ తేది బాలాజీనగర్ వాసులు ఆ ప్రాంత సర్కిల్ ఇన్స్పెక్టర్ ఇంటి ఎదుట ధర్నాకు దిగారు. అంతకు ముందు రోజే బాలాజీనగర్ సిఐ, ఎస్ఐలను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మందలించారు. బాలాజీనగర్ స్టేషన్‌లో కొత్త ఉత్సాహవంతులైన సిబ్బందిని నియమించి ప్రజల్లో పోలీసు శాఖ పట్ల వున్న ఆత్మవిశ్వాసాన్ని ప్రోది చేయాల్సిన బాధ్యత ఎస్పీగారిదే.

## తహశీల్దార్ శ్రీధర్ పదవీ విరమణ!

నెల్లూరు జాతీయ పొదుపు మొత్తాల సంస్థ తహశీల్దార్‌గా పని చేస్తుండిన తోటపల్లి శ్రీధర్ జూలై 31వ తేది పదవీ విరమణ చేశారు. శ్రీధర్ జిల్లా కలెక్టర్లుగా పనిచేసిన సుజాతరావు, రాజు, డాక్టర్ ప్రశాంత్ మహాపాత్ర, జెసిలుగా పనిచేసిన విఎస్ సంపత్, వి.దయాచారి, విశ్వంత్, ఎస్.ఎస్. రావత్, కాడ్మియేల్‌ల వద్ద సిసిగా పని చేశారు. ఎమ్మార్వోగా రాపూరు, వెంకటాచలం, ఓజిలిలో పనిచేశారు. తహశీల్దార్‌గా సంగం, దొరవారిసత్రం, దగదర్తిలలో విధులు నిర్వహించారు. రెవిన్యూ శాఖలో స్టెనోగ్రాఫర్‌గా చేరిన ఆయన మూడు దశాబ్దాలకు పైగా వివిధ హోదాల్లో పనిచేసి పేరుగడించారు.

## కావలి సిఐకు దర్యాప్తు బాధ్యత

దొంగలను పట్టడంలో, కేసులను ఛేదించడంలో మంచి ప్రతిభ కన్పరిచే అధికారిగా కావలి పట్టణ సిఐ శ్రీనివాసన్‌కు పేరుంది. వెంకటగిరి రాజాల ఇంట్లో జరిగిన దొంగతనాన్ని ఆయన ఛేదించి వున్నారు. అలాంటి అధికారికి ఒంగోలులో పేరొందిన లాయర్ మోహన్‌దాస్ ఇంట్లో మాయమైన 250 సవర్ల బంగారు నగల వ్యవహారం దర్యాప్తు బాధ్యతలు అప్పగించడం విశేషం. గత డిసెంబరులో సంచలనం రేపిన ఈ కేసులో దర్యాప్తు ఏమాత్రం పురోగతి లేకపోవడంతో ఉన్నతాధికారుల ఆదేశాల ప్రకారం ఐజి హరీష్‌కుమార్ గుప్తా ఈ కేసు దర్యాప్తు శ్రీనివాసన్‌కు అప్పగించారు. ఆయన ఎలా దొంగలను పడతాడో చూడాలి?



న్యూఢిల్లీలోని ఆల్ ఇండియా అచీవర్స్ ఫౌండేషన్ ప్రకటించిన ఇండియన్ లీడర్‌షిప్ అవార్డ్ ఫర్ హాస్పిటాలిటీ అండ్ టూరిజంను అందుకొంటున్న నెల్లూరు డిఆర్ ఉత్తమ హోటల్ అధినేత ధనుంజయరెడ్డి.

## డిఆర్ ధనుంజయకు ఒకేసారి రెండు అవార్డులు

డిఆర్ ఉత్తమ హోటల్ అధినేత కొడవలూరు ధనుంజయరెడ్డి బంపర్ జాక్‌పాట్ కొట్టాడు. ఒకేసారి రెండు అవార్డులు వరించాయాయన్ను. న్యూఢిల్లీలో ఆల్ ఇండియా అచీవర్స్ ఫౌండేషన్ అనే సంస్థ ఆయన్ను "ఇండియన్ లీడర్‌షిప్ అవార్డ్ ఫర్ హాస్పిటాలిటీ అండ్ టూరిజం" విభాగంలో సత్కరించింది. ఢిల్లీకి చెందిన మరొక సంస్థ ఇండియన్ ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ రీసెర్చ్ అసోసియేషన్ – ఆయనకు "ఇంటర్నేషనల్ టూరిజం అవార్డ్" బహూకరించింది.

ధనుంజయరెడ్డి కుడుమిస్తే పండగగా భావించే భోళా శంకరుడు. అల్పసంతోషి. ఆ అమాయకత్వంతోనే కోట మండల రాజకీయాల్లో కొంప కొల్లేరు చేసుకొన్నాడు. ఇప్పుడు నెల్లూరు టౌన్ రాజకీయ ఆషాడభూతుల చేతుల్లో ఇల్లు గుల్ల చేసుకొంటున్నాడు. ఆయన సేవలను నెల్లూరులో ఎవరూ గుర్తించడం లేదన్న లోపాన్ని దేశ రాజధానిలోని సంస్థలు తీర్చడం సంతోషించదగిన విషయం. ఆయనకు మా అభినందనలు.

## ఎస్ఎఫ్ఐ నూతన కార్యవర్గం

సిపిఎం అనుబంధిత విద్యార్థి విభాగం స్టూడెంట్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా(ఎస్ఎఫ్ఐ) జిల్లా అధ్యక్ష, కార్యదర్శులుగా కిరణ్, చిన్నాలను ఎంపిక చేశారు. వీరితోపాటు మరో 14 మందిని కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకొన్నారు.

## వేదవ్యాస విద్యార్థికి బహుమతి

హిరోషిమా దేను పురస్కరించుకొని 6వ తేదీ జనవిజ్ఞాన వేదిక నిర్వహించిన వ్యాసరచన పోటీల్లో నెల్లూరు వేదవ్యాస హైస్కూల్‌లో ఏడవ తరగతి చదివే విద్యార్థి ఆర్.కళ్యాణ్ ప్రథమ స్థానం, మనోజ్ఞ తృతీయ స్థానాలు సాధించినట్లు స్కూల్ కరస్పాండెంట్ ఏ.పి.బాలాజీ చెప్పారు.

## అలెగ్జాండర్ మరణం

మాజీ గవర్నర్ పిసి అలెగ్జాండర్ 90 ఏళ్ల నిండు జీవితాన్ని అనుభవించి, పండుటాకు వలె రాలిపోయాడు. 10వ తేదీ మద్రాసులో కన్నుమూశారాయన. అలెగ్జాండర్ అత్యంత అసాధారణ ప్రతిభావంతుడు. పసితనంలోనే ఆ ప్రజ్ఞాపాటవాలు వ్యక్తం కావడం విశేషం.

కొరవ 14వ పేజీలో

## వేలం నోటీసు

**టెండరు/వేలం ప్రకటన నెం.3202/Auction /jeep /AP 09 E 7396 తేది: 8-08-2011**

నెల్లూరు జిల్లా సహాయ సంచాలకులు గనులు, భూగర్భశాఖ వారి కార్యాలయమునకు సంబంధించిన మహేంద్ర కంపెనీకి చెందిన పాత కమాండర్ వాహనము నెం. ఎ.పి 09 ఇ 7396ని పాత తుక్కు క్రింద సీల్డు టెండరు / వేలంపాట కొరకు దరఖాస్తులను ఆహ్వానించడమైనది. వాహన స్థితిని యధావిధిగా ఎచ్చట, ఎట్లు కలదో అట్లు తుక్కు క్రింద భావించి సీల్డు టెండరు / వేలంలలో పాల్గొనాలి. వాహన కనీస ధర రూ.30,000/-లు. (అక్షరములా ముప్పైవేలు) నిర్ణయించిన E.M.D రూ.1000/-లు (అక్షరములా వెయ్యి రూపాయలు). దరఖాస్తు మరియు వివరముల కొరకు రూ.100/-లు (తిరిగిరాని) ధరఖాస్తు రుసుముగా డిడి రూపాన ఈ క్రింది వారి పేరున చెల్లించుటనట్లుగా తీసుకొని పొందవచ్చును. పూర్తిచేసిన దరఖాస్తులను ఇచ్చుటకు చివరి తేది 29-08- 2011 సాయంత్రం 4 గంటలకు. **వేలం తేది 30-08-2011.**

**పి.వి.రెడ్డి** సహాయ సంచాలకులు, గనులు మరియు భూగర్భ శాఖ, నెల్లూరు.

# ఆదర్శప్రాయమైన నేత బెజవాడ గోపాలరెడ్డి!

## ● అవార్డు ప్రదాన సభలో వెంకయ్యనాయుడు

సుప్రసిద్ధ రాజకీయవేత్త, మాజీ గవర్నర్ దివంగత డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అవార్డు ప్రదానోత్సవ సభ ఆహుతులు, ఆత్మీయ అతిథులు, బెజవాడ అభిమానులు, పుర ప్రముఖుల నడుమ 7వ తేది సాయంత్రం టౌన్‌హాలులో ఘనంగా జరిగింది. డాక్టర్ బెజవాడ పేరిట ఏర్పాటుచేసిన అవార్డును ప్రతి ఏటా ఆయా రంగాల్లో లబ్ధప్రతిష్టులైన ప్రముఖులకు అందజేస్తున్నారు. ఈ ఏడాది ఈ అవార్డుకు ప్రముఖ పారిశ్రామికవేత్త, ప్రపంచ తెలుగు సమాఖ్య వ్యవస్థాపక అధ్యక్షురాలు ఇందిరాదత్‌ను ఎంపిక చేశారు. ఈ అవార్డు ప్రదానోత్సవ కార్యక్రమానికి బిజెపి సీనియర్ నేత, రాజ్యసభ సభ్యుడు ముప్పవరపు వెంకయ్యనాయుడు ముఖ్య అతిథిగా విచ్చేయగా, నగర, రూరల్ శాసనసభ్యులు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఆనం వివేకానందరెడ్డి తదితరులు పాల్గొన్నారు. రాజకీయాలలో విలువలు పతనం అవుతున్నాయని ఆవేదన వ్యక్తం చేసిన వెంకయ్య నాయుడు బెజవాడ గోపాలరెడ్డి నేటితరానికి ఆదర్శం అన్నారు. ఎన్నో ఉన్నత పదవులను అలంకరించిన ఆయన ఆ పదవులకు వన్నెతెచ్చారని, రాజకీయాల్లో స్వచ్ఛంద పదవీ విరమణ చేసిన గొప్పవ్యక్తని కొనియాడారు. నీతిమాలిన రాజకీయాలను ప్రక్షాళన చేయడానికి ప్రజలే ముందుకు రావాలన్నారు. బెజవాడ అవార్డును ఇందిరాదత్‌కు ఇవ్వడం సముచితమన్నారు. అనంతరం ఇందిరాదత్‌కు కిరీటధారణ చేసి శాలువతో సన్మానించి సన్మానపత్రం అందజేశారు. ఈ సందర్భంగా ఆమె తన ఆనందాన్ని వ్యక్తం చేస్తూ మహానేత, రాజకీయాలలో ఆదర్శనీయుడైన గోపాలరెడ్డి అవార్డు తనకు ఇవ్వడం అదృష్టంగా భావిస్తున్నానని తెలిపారు. విశాఖలో తెలుగువారి సంస్కృతి సాంప్రదాయాలను కాపాడే రీతిలో తెలుగు మ్యూజియంను ఏర్పాటు చేస్తున్నామని 2012కు అది పూర్తవుతుందన్నారు. ఈ కార్యక్రమంలో బెజవాడ అవార్డు కమిటీ అధ్యక్ష, కార్యదర్శులు జె.వి.రెడ్డి, బి.వి.నరసింహం తదితరులు పాల్గొన్నారు.



ఇందిరాదత్‌ను సత్కరిస్తున్న వెంకయ్యనాయుడు, వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి, బలరామిరెడ్డి, పార్వతమ్మ, వివేకానందరెడ్డి.

# కలెక్టర్ కొత్త పథకం!

## ● ప్రతిభావంతులకు బాసటగా సరస్వతి నిధి



జిల్లాలో పనిచేసిన కలెక్టర్లెందరో పేద ప్రజలకు అండగా నిలిచారు. వారి అభ్యున్నతికెంతగానో కృషి చేశారు. ఆ బాటలోనే జిల్లా కలెక్టర్ శ్రీధర్ పేద విద్యార్థులకు బాసటగా నిలిచేందుకు శ్రీకారం చుట్టారు. ప్రతిభ వుండి ఆర్థిక పరిస్థితుల కారణంగా చదువు సాగించలేని వారిని ఆదుకొని వారికి చేయూతనిచ్చేందుకు నడుం బిగించారు. అదే 'సరస్వతి నిధి'. పదవ తరగతిలో ఎక్కువ మార్కులు సాధించిన పేద విద్యార్థులకు ఉన్నత విద్యనందించడం సరస్వతి నిధి ఉద్దేశం. సొంత నిధులతో ప్రారంభించిన ఈ నిధికి దాతలు సహకరించాలని పిలుపునిచ్చిన కలెక్టర్ కోటి రూపాయలతో నిధిని ఏర్పాటుచేసి దానిని బ్యాంకులో డిపాజిట్‌చేసి వచ్చే వడ్డీతో కార్పొరేట్ కళాశాలల్లో పేద విద్యార్థులను చదివించేలా కలెక్టర్ చర్యలు చేపడుతున్నారు. సరస్వతి నిధి గురించి కలెక్టర్ వివరిస్తూ జిల్లాలో ప్రస్తుతం కార్పొరేట్ విద్యను 206 మందికే అందించగలుగుతున్నాం. ఈ సంఖ్యను మరింత పెంచితే ఎంతో మంది పేద విద్యార్థులు ఉన్నత చదువు కొనసాగించగలుగుతారని ఆలోచించి ఏర్పాటు చేశాం. నెల్లూరీయులలో దాతృత్వం ఎక్కువ. సేవాగుణమున్న వారు ఎందరో వున్నారు. కోటి రూపాయల నిధితో వచ్చే వడ్డీలో 50 శాతం ఎస్సీ, ఎస్టీ విద్యార్థులకు, మిగతా సగం ఇతర విద్యార్థులకు ఖర్చు చేస్తామన్నారు. ఈ విద్యాయజ్ఞంలో దాతలిచ్చే ప్రతిపైసా సద్వినియోగమయ్యేలా చేస్తానని కలెక్టర్ భరోసా ఇచ్చారు.

# డామిట్... కథ అడ్డం తిరిగింది

## ● ప్రైవేట్ పాఠశాలల అసోసియేషన్ల మథనం

రెంటికీ చెడ్డ రేవడి అన్న చందంగా వుంది నగరంలోని పలు ప్రైవేట్ విద్యాసంస్థల యాజమాన్యాల పరిస్థితి. వీరిలో అధికభాగం మొదటి నుంచి రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డికి మద్దతుదారులుగా వుంటూ ఆయన కాలితో చెప్తే చేత్తో పని చేసేంతగా అడుగులకు మడుగులొత్తారు. గుర్తింపులేని పాఠశాలలను రద్దు చేయాలని కోరుతూ ప్రైవేట్ పాఠశాలల అసోసియేషన్లు రెండూ ఈ ఏడాది పాఠశాలలు తెరచిన నాటి నుంచి ఆందోళన చేశారు. పాఠశాలల అడ్మిషన్ల గురించి పట్టించుకోకుండా పోటీలు పడి ధర్నాలు, ఆందోళనలు చేపట్టారు. వివేకానందరెడ్డి తమ మాట వింటారని, ఆయన ఎన్నికలలో తమ సహకారం పొందాడు కాబట్టి తమవైపే మొగ్గుచూపుతాడని గుర్తింపులేని పాఠశాలలను రద్దుచేయిస్తాడని ఆశపడ్డారు. కథ అడ్డం తిరగడంతో వీరికి దిమ్మ తిరిగి పోయింది. పెద్ద పెద్ద పాఠశాలలు, పలుకుబడి గల యాజమాన్యాలు లక్షల సొమ్ముతో ఎమ్మెల్యేను తమవైపు తిప్పుకోవడంతో ఆయన ప్రైవేట్ అసోసియేషన్ నేతలు చేసిన ఉపకారాన్ని మరచి వారినే మందలించడంతో ఖిన్నులయ్యారు. తమను కరివేపాకులా వాడుకొని పారేశారంటూ లోలోన మథనపడుతున్న యాజమాన్యాలు ఎమ్మెల్యేకు దూరంగా వుండాలని నిర్ణయించుకున్నట్లు సమాచారం. ఇకపై ఆయన పిలిస్తే పరుగెత్తుకెళ్లి ఇళ్లు, ఒళ్లు గుల్లచేసుకొని కార్యక్రమాలు చేయనవసరం లేదని నిర్ణయించుకొన్నారట. మొత్తంమీద గుర్తింపు వివాదం నగరంలోని ప్రైవేట్ విద్యాసంస్థల యాజమాన్యాలకు జ్ఞానోదయం కల్గించింది.

# మొక్కుబడిగా తల్లిపాల వారోత్సవాలు

## ● ఉత్త విస్తరి - మంచినీళ్లలా కార్యక్రమం

జిల్లాలో తల్లిపాల వారోత్సవాల కార్యక్రమాన్ని ఐసిడిఎస్ అధికారులు ర్యాలీలు చేపట్టి అయ్యాయనిపించారు. జిల్లా మొత్తం మీద ఐసిడిఎస్ పరిధిలో 3089 అంగన్‌వాడీ కేంద్రాలుండగా వీటిలో 1.6 లక్షల మంది ఆరేళ్లలోపు పిల్లలున్నట్లు అధికారిక లెక్కలు చెబుతున్నాయి. తల్లిపాల వారోత్సవాలను ఘనంగా నిర్వహించమని ఆదేశాలు జారీ చేయడంతో అంగన్‌వాడీ కార్యకర్తలు మరో గత్యంతరంలేక బాలింతలు, గర్భవతులను పిలిపించి మమ అనిపించారు. ప్రాజెక్ట్ డైరక్టర్ ఆదేశాలతో సిడిపిఓలు, వీరు సూపర్‌వైజర్లకు, వారు అంగన్‌వాడీ సిబ్బందికి ఆదేశాలిచ్చి ఉత్త విస్తరి, మంచినీళ్ల సామెతలా మొత్తం మీద ఈ కార్యక్రమం కానిచ్చారు.

# పరిపాలనపై కలెక్టర్ దృష్టి!

జిల్లా కలెక్టర్‌గా బాధ్యతలు స్వీకరించిన బి.శ్రీధర్‌రెడ్డి పరిపాలనపై ప్రత్యేక దృష్టిసారించారు. ఈ నాలుగు నెలల కాలంలో పలు మండల కార్యాలయాలు, గ్రామాలను ఆయన సందర్శించారు. ఉపాధి హామీ పథకం, సంక్షేమ వసతి గృహాలు, పాఠశాలలను తనిఖీ చేశారు. అధికారుల పనితీరు ఎలా వుందో తెలుసుకున్నారు. తరచూ జిల్లా, మండల స్థాయి అధికారులతో సమీక్ష సమావేశాలు ఏర్పాటు చేసి విధుల పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరించే వారిని సున్నితంగానే హెచ్చరికలు చేస్తున్నారు. ప్రధానంగా విద్య, వైద్య, సంక్షేమ శాఖల పనితీరును మెరుగు పరిచేందుకు శ్రీకారం చుట్టారు. అధికారులు సమన్వయం చేసుకుంటూ నిత్యం ప్రభుత్వ కార్యక్రమాల్లో నిమగ్నమై వుంటున్నారు. కలెక్టర్ తీసుకుంటున్న నిర్ణయాలు కొందరికి ఇబ్బందిగా వున్నా ఎక్కడ వేటు పడుతుందన్న భయంతో విధులకు హాజరవుతున్నారు. మండలస్థాయిలో అధికారులు జవాబుదారీతనంగా పనిచేస్తే కొన్ని సమస్యలు వెంటనే పరిష్కరించబడతాయి.

## ● క్రమశిక్షణకు మారుపేరు

# ప్రియదర్శిని!



విద్యతోపాటు క్రమశిక్షణకు, మంచి నడవడికకు ప్రాధాన్యమిచ్చే కళాశాలగా పేరొందింది నగర శివార్లలోని కనుపర్తిపాడు, సూళ్లూరుపేటల్లో ఏర్పాటైన ప్రియదర్శిని ఇంజనీరింగ్ కళాశాల. జిల్లాలోని వివిధ ప్రాంతాల విద్యార్థులందరికీ అంతర్జాతీయ స్థాయిలో మెరుగైన సాంకేతిక విద్యను అందించాలన్న లక్ష్యంతో జిల్లాలోని రెండు ప్రాంతాల్లో ఇంజనీరింగ్ కళాశాలలను నిర్వహిస్తున్న యాజమాన్యం పొరుగున వున్న చిత్తూరు జిల్లా రామచంద్రాపురం వద్ద ఇంజనీరింగ్ కళాశాలను నిర్వహిస్తోంది. 1985 నుంచి విద్యాసంస్థలను నడుపుతూ మంచి విద్యను అందించడంలో పేరుగడించారు ప్రియదర్శిని విద్యాసంస్థల స్థాపకులైన సుబ్బరామిరెడ్డి, శ్రీనాథరెడ్డి. ఈ సోదర ద్వయం కళాశాల, విద్యాసంస్థల స్థాపన గురించి మాట్లాడుతూ క్రమశిక్షణతో కూడిన నాణ్యమైన విద్యను అందించాలన్న లక్ష్యంతో విద్యాసంస్థలను నెలకొల్పామన్నారు. మారుతున్న కాలానికి అనుగుణంగా అంతర్జాతీయ స్థాయిలో సాంకేతిక విద్యను గ్రామీణ ప్రాంత విద్యార్థులకు సైతం అందుబాటులోకి తేవాలన్న ఆశయంతో సూళ్లూరుపేటలో 2001లో, కనుపర్తిపాడులో 2005లో, 2008లో తిరుపతి సమీపంలో రామచంద్రాపురం వద్ద ఇంజనీరింగ్ కళాశాలలను స్థాపించినట్లు చెప్పారు. ఆహ్లాదకరమైన వాతావరణం, ఇంటర్నెట్ సదుపాయం, ల్యాబ్‌లు, హాస్టల్, బస్సు సౌకర్యాలతో కూడిన జిల్లాలో గల ఇంజనీరింగ్ కళాశాలలకు విద్యారంగంలో అపార అనుభవం కల్గిన డాక్టర్ గోపాలరెడ్డి డైరక్టర్‌గా వున్నారని, తిరుపతి వద్దగల కళాశాలకు డాక్టర్ బ్రహ్మయ్య ప్రిన్సిపాల్‌గా వ్యవహరిస్తున్నారని తెలిపారు.

# ఇందిర క్రాంతి పథానికి మంగళం!

**ప్రపంచ బ్యాంకు నిధులతో నడిచే ఈ పథకానికి గత ఏడాది మంగళం పాడాలనుకొన్నారు. కానీ కేంద్ర ప్రభుత్వ ప్రత్యేక విజ్ఞప్తితో ఈ యేడాది సెప్టెంబర్ నెల వరకు పొడిగించారు. ఈ దఫా పొడిగించే అవకాశాలు కానరావడం లేదు.**



నెల్లూరులోని ఇందిరక్రాంతి పథం కార్యాలయం.

స్వయం సహాయక సంఘాలను బలోపేతం చేసి మహిళా సాధికారిత సాధించాలన్న లక్ష్యంతో ప్రవేశపెట్టిన ఇందిరక్రాంతి పథానికి త్వరలో మంగళం పాడనుంది ప్రభుత్వం. ప్రపంచ బ్యాంకు నిధులతో రాష్ట్రంలో 2001 సంవత్సరంలో "వెలుగు" అనే పేరుతో ప్రవేశపెట్టింది అప్పటి తెలుగుదేశం ప్రభుత్వం. ఆ తర్వాత అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం పథకాలకు పేర్లు మార్చే క్రమంలో వెలుగును ఇందిర క్రాంతి పథంగా మార్పు చేయడం జరిగింది.

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ పర్యవేక్షణలోనే ఈ పథకం అమలు జరిపేవారు. మునిసిపాల్టీ ప్రాంతాల్లో కమిషనర్ పర్యవేక్షణలో అమలు చేసేవారు. ప్రస్తుతం ఇందిర క్రాంతి పథం వచ్చే నెల సెప్టెంబర్ నాటికి అదృశ్యం అయ్యే అవకాశాలు వున్నాయి. ఈ మేరకు కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి సంకేతాలు పంపింది. ప్రపంచ బ్యాంకు నిధులు మంజూరు చేసే గడువు గత సంవత్సరంతో ముగిసినా కేంద్రం విజ్ఞప్తి మేరకు ఈ సంవత్సరం సెప్టెంబర్ వరకు పొడిగించారు. ఈ దఫా పొడిగించే అవకాశాలు లేకపోవడంతో ప్రత్యామ్నాయ ఏర్పాట్ల కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అన్వేషిస్తున్నాయి.

ఇందిర క్రాంతి పథానికి నిధులు సమకూర్చేందుకు ప్రత్యేక ఏజెన్సీ ఏర్పాటు కాకపోతే ప్రస్తుతం వున్న స్వయం సహాయక సంఘాల భవిష్యత్ ప్రశ్నార్థకంగా మారే అవకాశం వుంది. వీటికి ఇప్పటి వరకు అందించిన, అందిస్తున్న రుణాలు పూర్తిగా నిలిచి పోతాయి. ఈ శాఖలో పనిచేస్తున్న సిబ్బంది పరిస్థితి ఏమిటన్నది ప్రశ్న. అవుట్ సోర్సింగ్, కాంట్రాక్టు పద్ధతిలో అనేక మంది విధులు నిర్వహిస్తున్నారు. రెగ్యులర్ సిబ్బందిని ఇతర శాఖలకు, అవుట్ సోర్సింగ్, కాంట్రాక్టు సిబ్బందిని ఇంటికి పంపే అవకాశాలున్నాయని ఆ శాఖ ఉద్యోగులే వ్యాఖ్యానిస్తున్నారు.

బ్యాంకు లింకేజి రుణాలు 100 కోట్ల రూపాయలకు పైగా బకాయిలు పేరుకుపోయి వున్నాయి. ఈ బకాయిలను వసూలు చేయడం కష్టతరంగా మారింది. బ్యాంకు అధికారులు ఏంచేయాలో తెలియక కొత్తగా రుణాలు ఇవ్వడం మానేశారు. కేంద్ర ప్రభుత్వం మాత్రం మహిళా సాధికారత కోసం నిధుల కేటాయింపు జరుపుతామని భరోసా ఇస్తున్నా పథకాలను ఎలా అమలు చేస్తారన్న దానిపై స్పష్టత లేకుండా పోయింది. ఈ శాఖ అధికారులు మాత్రం ప్రపంచ బ్యాంకు నిధులు సెప్టెంబర్ నెలాఖరుకు నిలిచిపోతాయన్న విషయాన్ని ఎక్కడా వెల్లడించకుండా జాగ్రత్త పడుతున్నారు.

స్వయం సహాయక సంఘాల సభ్యుల ఆర్థికాభివృద్ధికి ఈ సంవత్సరం 300 కోట్ల రూపాయలు రుణాలు అందించాలన్న లక్ష్యంగా నిర్ణయించారు. గత సంవత్సరం నిర్ణయించిన లక్ష్యాలను ఈ సంవత్సరం పూర్తిచేసి ఈ సంవత్సరం లక్ష్యాలను సాధించినట్లుగా రికార్డుల్లో నమోదు చేసేస్తున్నారు. వాస్తవ పరిస్థితులకు, అధికారులు చేసే ప్రకటనలకు పొంతన కుదరడం లేదు. మరో నెల రోజుల లోపల ఇందిర క్రాంతి పథం కొనసాగిస్తారా? లేదా? అన్నది తెలుస్తుంది. J

---

## అమలు కాని

# బాల కార్మిక చట్టాలు!

**పలకా బలపం పట్టి పాఠశాలల్లో వుండాల్సిన చిన్నారులు బాల కార్మికులుగా మెకానిక్ షెడ్లు, టీ దుకాణాలు, హోటళ్లలో పనిచేస్తూ కనపడుతూ బాలల సంరక్షణ చట్టంలోని లొసుగులను లోకానికి చాటుతున్నారు.**

పాఠశాలల్లో పలకా, బలపం పట్టాల్సిన చిన్నారులు బాల కార్మికులుగా వివిధ ప్రాంతాల్లో పని చేయడం అందరికి తెలిసిందే. బాలల సంక్షేమం, హక్కుల కోసం చట్టాలు రూపొందించబడినా వాటిని అమలు చేయడంలో సంబంధిత శాఖలు పూర్తిగా విఫలం చెందాయి. సభలు, సమావేశాల సందర్భంగా వేదికలెక్కి బాలల హక్కులు కాలరాస్తే కఠిన చర్యలు తీసుకుంటామని హెచ్చరికలు చేయడం తప్ప వారి సంక్షేమం కోసం కృషి చేసే ప్రజాప్రతి నిధులు, అధికారులు కనిపించకుండా పోతున్నారు.

మెకానిక్ షెడ్లు, టీ దుకాణాలు, హోటల్స్‌లో 15 సంవత్సరాలు కూడా నిండని పిల్లలు బాలకార్మికులుగా పని చేస్తున్నారు. కుటుంబ ఆర్థిక పరిస్థితుల కారణంగా కొందరు బాలలు పనికి కుదురుతుంటే, ఇంటి నుంచి పారిపోయివచ్చి పనికి చేరేవారు మరి కొందరుంటున్నారు. ప్రభుత్వ కార్యాలయాలు, గ్రామ పంచాయితీ కార్యాలయాలు, ప్రధాన కూడళ్లలో బాలకార్మికుల హక్కులు, సంక్షేమంపై అందరిని ఆకట్టుకునే విధంగా వాల్‌పోస్టర్లు కనిపిస్తుంటాయి. కేవలం కాగితాల్లోనే సంక్షేమాన్ని దాచేశారు అధికారులు. బాల కార్మికులుగా పని చేస్తున్న వారిని చేరదీసి విద్యాబుద్ధులు చెప్పించే నాధుడే లేకుండా పోయాడు.

### చట్టంతో మార్పు వస్తుందా?

ఇటీవల ప్రభుత్వం బాల సంరక్షణ – రక్షణకు ప్రత్యేక చట్టాన్ని రూపొందించింది. 18 సంవత్సరాలు నిండని వారినంతా బాలలుగా గుర్తించాలని ఈ యాక్టులో వుంది. ఇప్పటి వరకు కొన్ని ప్రభుత్వశాఖలే బాలల హక్కులు, సంక్షేమంపై కృషి చేసే విధంగా ఉత్తర్వులున్నాయి. ఈ చట్టంలో తాజాగా పోలీస్ శాఖను కూడా చేర్చింది. సాంఘిక సంక్షేమశాఖ, గిరిజన సంక్షేమ శాఖ, వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ, కార్మిక శాఖ, స్త్రీ సంక్షేమం, శిశు అభివృద్ధి సంస్థలతోపాటు పలు స్వచ్ఛంద సంస్థలు కూడా బాల కార్మికుల సంరక్షణపై ప్రత్యేక దృష్టి సారించాల్సి వుంటుంది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుంచి నిధులు పొందుతున్న స్వచ్ఛంద సంస్థలపై కూడా నిఘా పెరగనుంది. బాల కార్మికులకు ఆశ్రయం కల్పించడంతోపాటు వారికి ప్రత్యేక పాఠశాలను ఏర్పాటు చేయాల్సి వుంటుంది. ప్రభుత్వం విడుదల చేస్తున్న నిధులపై తనిఖీలు కూడా జరుగనున్నాయి. ఇప్పటి వరకు లక్షలాది రూపాయల నిధులు మంజూరు చేయించుకుని, వాటిని సొంతానికి వాడుకున్న సంస్థలపై చర్యలు తీసుకొనే అవకాశం వుంటుంది. బాల కార్మిక వ్యవస్థ నిర్మూలన, సంక్షేమం – రక్షణకు ఈ చట్టంతోనైనా మార్పు వస్తుందా అనేది సందేహంగా వుంది.

ఉచిత నిర్బంధ విద్య అమలు చేయాలని ప్రభుత్వం ప్రకటించినా అది ఎక్కడా అమలు కావడం లేదు. ఇటీవల ప్రత్యేక చట్టంపై జిల్లా అధికారయంత్రాంగం నిర్వహించిన సమీక్షా సమావేశంలో బాలల సంరక్షణ – రక్షణ చట్టాన్ని కఠినంగా అమలు చేయాలని నిర్ణయించారు. అన్ని శాఖల అధికారులు బస్టాండు, రైల్వే స్టేషన్లలో తిరిగే బాలలను సంరక్షణ కేంద్రాలలో చేర్పించి విద్యనందిస్తే కొంత మేర లక్ష్యం నెరవేరే అవకాశం వుంది. J



నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలోని ఆర్‌ఎస్‌ఆర్ వాకర్స్ అసోసియేషన్ సభ్యులు ఏర్పాటు చేసిన రక్తదాన శిబిరంలో సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి, వాకర్స్ అసోసియేషన్ డిస్ట్రిక్ట్ గవర్నర్ దేవరాల సుబ్రహ్మణ్యం తదితరులు.



నెల్లూరు జాతీయ పొదుపు మొత్తాల తహశీల్దార్‌గా పదవీ విరమణ చేసిన తోటపల్లి శ్రీధర్‌ను సత్కరిస్తున్న ఎన్‌ఎస్‌ఎస్ ఏజంట్ల అసోసియేషన్ నేతలు ఆంజనేయులు, సుబ్బారావు తదితరులు.




నెల్లూరు విఆర్ కాలేజి అంబేద్కర్ విగ్రహం వద్ద చుండూరు మృతవీరులకు శ్రద్ధాంజలి ఘటిస్తున్న దళిత నాయకులు బాబు, పూర్ణ, అరుణాచలం తదితరులు.

# ప్రజల బాధ పట్టని ప్రభుత్వాలు!



రాష్ట్రంలో పరిపాలన అస్తవ్యస్తంగా తయారైందని, ప్రజల బాగోగులు పట్టించుకొనే పాలకులే లేకుండాపోయారని తెలుగుయువత రాష్ట్ర అధ్యక్షుడు బీద రవిచంద్ర విమర్శించారు. ఇటీవల అల్లూరుకు వచ్చిన ఆయన మాట్లాడుతూ రాష్ట్రంలో ప్రభుత్వం ప్రజాసమస్యలను ప్రక్కనపెట్టిందన్నారు. కేంద్రప్రభుత్వం తెలంగాణ అంశంపై స్పష్టమైన వైఖరి తీసుకోకపోవడం, ఎటూ తేల్చకపోవడంతో శాంతిభద్రతలకు భంగం వాటల్లుతోందని ఆందోళన వ్యక్తం చేశారు. ఎవరికి వారు ఇష్టానుసారంగా వ్యవహరిస్తుండడంతో పాలన కుంటుపడిందని, ప్రజలు సమస్యలతో సతమతమవుతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు.

# ఆత్మకూరు కాంగ్రెస్ కార్యకర్తలలో అసంతృప్తి!

● మంత్రి పలకకపోవడమే కారణం

ఆత్మకూరు నియోజకవర్గ రాజకీయాల్లో అనూహ్యమార్పులు చోటు చేసుకొంటున్నాయి. నిన్న మొన్నటి వరకు కాంగ్రెస్ పార్టీ పట్ల అభిమానం కనపరచిన ప్రజల్లో ఇప్పుడు తీవ్ర వ్యతిరేకత వ్యక్తం అవుతోంది. ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్నప్పటికీ నియోజకవర్గ కార్యకర్తలు అసంతృప్తిగా వున్నారు. దీనికి కారణం ఆనం వ్యవహారశైలి. నియోజకవర్గ ప్రజలతోపాటు కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలకు అందుబాటులో వుండకపోవడం, కొద్దిమందికి మాత్రమే టచ్‌లో వుండడం, ఎలాంటి అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టక పోవడంతో క్యాడర్‌లో అసంతృప్తి సెగలు కక్కుతోంది. ఈ పరిస్థితుల్లో జగన్ నేతృత్వంలోని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ పట్ల అంతా మొగ్గు చూపుతున్నారు. నియోజకవర్గ పరిధిలో ఈ పార్టీకి అధికసంఖ్యలో అభిమానులున్నా పార్టీని ముందుకు నడిపించే నాయకుడు కరువయ్యాడు. బలమైన నాయకులంటూ లేకపోవడంతో ఆ పార్టీలో స్తబ్ధత నెలకొనింది. ఇక తెలుగుదేశం పార్టీ పరిస్థితి అగమ్యగోచరంగా మారింది. ప్రధాన ప్రతిపక్షమైన ఆ పార్టీ ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలపై సర్వత్రా నిరసనలు చేపడుతున్నా ఇక్కడ మాత్రం ఎలాంటి కార్యక్రమాలు నిర్వహించలేకపోతున్నారు. అసలే అంతంత మాత్రంగా వున్న పార్టీ పరిస్థితి రెండు గ్రూపులుగా విడిపోయి ఆధిపత్యపోరుకు దిగడంతో మరింత క్షీణించింది. ఈ పరిస్థితులలో భవిష్యత్తులో నియోజకవర్గంలో ఏపార్టీని ప్రజలు ఆదరిస్తారనేది వేచి చూడాల్సిందే.

# ప్రభుత్వ స్థలమా... అయితే వేసేయ్ పాగా!

● నాయుడుపేటలో పరిస్థితిది

నాయుడుపేట పట్టణంలో దురాక్రమణలు జోరందుకొంటున్నాయి. ప్రభుత్వస్థలం, పంట కాలువలు దేనిని కబ్జాదారులు విడిచిపెట్టడం లేదు. ప్రభుత్వ స్థలాలు, కాలువలు ఆక్రమణకు గురౌతున్నా సంబంధిత శాఖల అధికారులు పట్టించు కోకపోవడంతో రోజురోజుకు ఇవి అధికం అవుతున్నాయి. పట్టణంలో ఎల్ఐసి ఆఫీసు దగ్గర పంటకాలువ ఆక్రమించిన ఒక వ్యక్తి ఏకంగా మూడంతస్థుల భవనాన్ని నిర్మించేశాడు. కాలువపై నిర్మాణం జరుగుతున్నా ఇరిగేషన్‌శాఖాధికారులు ఆ వైపే కన్నెత్తి చూడకపోవడంపై పలు ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. స్వర్ణముఖి నుంచి బజారులోకి వచ్చే ఈ కాలువ ఇరుప్రక్కల ఆక్రమణలు, అక్రమ కట్టడాలు పెరిగిపోతున్నా అధికారులు చర్యలు చేపట్టకపోడం వెనుక కబ్జాదారుల నుంచి ముడుపులు అందడమే కారణమనే ఆరోపణలు వినవస్తున్నాయి. ఎవరు ఏ స్థలమైనా ఆక్రమించుకోండి మాకు రావాల్సింది మాకివ్వండి అనే ధోరణిలో అధికారులు వుండడంతో కబ్జాలు పెరిగిపోతున్నాయని పట్టణ ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు.

● లంచావతారులు

# కలువాయి పోలీసులు!

కలువాయి పోలీస్‌స్టేషన్ సిబ్బంది లంచాల దాహానికి అంతే లేకుండా పోతోంది. గతంలో ఇక్కడ పనిచేసిన ఎస్ఐ ఎర్రచందనం స్మగ్లర్ల నుంచి చిన్నచిన్న కేసుల వరకు అన్నింటిని ఒక రేటు పెట్టి ముక్కుపిండి వసూలు చేసేవాడు. ఆయనను విఆర్‌కు పిలిపించడంతోనైనా మిగతాసిబ్బందిలో మార్పు వస్తుందనుకొన్నా వారిలో ఎలాంటి మార్పేమి కన్పించకపోగా ఎవరిపాటికి వాళ్లు కేసుల మధ్యస్థాలంటూ దోచుకతింటున్నారు. స్టేషన్‌కు వచ్చే ఫిర్యాదుదారులను వదలిపెట్టకుండా వచ్చినంత వసూలు చేస్తున్నారు. కొందరు సిబ్బంది అయితే స్టేషన్‌కు వస్తే ఎక్కడ తమకు వాటా అందకుండా పోతుందోనని బాధితుల ఇళ్లకే వెళ్లి అక్కడే

## ప్రతి పనికి పైసలు ముట్టచెప్పాల్సిందే!

సెటిల్‌మెంట్లు చేసేస్తున్నారు. మంచి రాబడి గల స్టేషన్ కావడంతో ఇక్కడ పనిచేసే సిబ్బంది బదలీ జరగకుండా ప్రయత్నించడం, ఒకవేళ బదలీపై వెళ్లినా కొద్ది కాలానికే తిరిగి కలువాయికి వచ్చేస్తున్నారంటే ఎంతగా కాసులు అందుతున్నాయో అర్థం చేసుకోవచ్చు. నిబంధనల ప్రకారం స్థానికులు అదే గ్రామంలో పని చేయకూడదు. కానీ ఆ కానిస్టేబుల్ ఇక్కడే పోస్టింగ్ తెచ్చుకొని మామూళ్ల వసూలు చేయడంలో దిట్టగా పేరు గడించాడు. స్మగ్లర్లతో సంబంధాలు, కేసుల్లో రాజీల పేరుతో రెండు వైపులా దండకాలతో స్టేషన్‌ను గబ్బుపట్టిస్తున్న పోలీసు సిబ్బందిపై అధికారులు తగిన చర్యలు తీసుకోకపోతే ఆశాఖ పరువుపోయేలా వుంది.

# ఐఐహెచ్‌టిని చుట్టుముట్టిన సమస్యలు

వెంకటగిరిలో ఏర్పాటైన ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ హ్యాండ్‌లూమ్ టెక్నాలజీ(ఐఐహెచ్‌టి) ఇనిస్టిట్యూట్ సమస్యలతో కొట్టుమిట్టాడుతోంది. 18 ఏళ్ల క్రితం నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న కాలంలో వెంకటగిరిలో ప్రతిష్టాత్మకమైన ఈ కళాశాలను ఏర్పాటు చేశారు. దేశంలో వివిధ రాష్ట్రాల్లో ఏర్పాటుచేసిన ఐఐహెచ్‌టి కేంద్రాలలో ఇది నాల్గవది కావడం విశేషం. ఉత్తరప్రదేశ్‌లో వారణాసి, తమిళనాడులో సేలం, అస్సాంలో గౌహతి, రాజస్థాన్‌లోని జోథ్‌పూర్, కర్నాటకలోని గడక్, ఒడిసాలోని బడగల్, చత్తీస్‌ఘడ్, కేరళ రాష్ట్రాల్లో ఈ సంస్థలను నెలకొల్పినా వారణాసి, సేలం, జోథ్‌పూర్‌లోని వాటికి మాత్రం కేంద్రం నిధులిస్తే, మిగతా

## వెంకటగిరిలో ప్రతిష్టాకరమైన సంస్థకు ఇబ్బందులు

ప్రాంతాల్లో రాష్ట్రప్రభుత్వమే భరించాల్సి రావడంతో వీటి పరిస్థితి నానాటికి దిగజారిపోతోంది. వెంకటగిరిలోని కళాశాలలో సిబ్బంది కొరత ప్రారంభం నుంచి వుంటున్నా దీనిని అధిగమించలేకపోతుండడంతో తీవ్ర ఇబ్బందులు ఎదురైతున్నాయి. 50కిపైగా సిబ్బంది వుండాల్సి వుండగా కేవలం 10మంది మాత్రమే వున్నారు. కళాశాల ఆవరణలోనే సిబ్బంది నివాసానికి క్వార్టర్లు నిర్మించినా వాటిలో కనీస వసతులు లేకపోవడంతో అవి నివాసానికి పనికి రాకుండా పోయాయి. కొన్ని సంవత్సరాలుగా వినియోగించకపోవడంతో శిథిలావస్థకు చేరుకొన్నాయి. ప్రిన్సిపాల్ తదితరులు వున్న సిబ్బందితోనే విద్యార్థులకు శిక్షణ నిస్తుండడంతో కొంతమేర ఉపయోగపడుతోంది. అలాంటి ఇనిస్టిట్యూట్‌ను పూర్తిస్థాయిలో ఉపయోగపడేలా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని పలువురు కోరుకొంటున్నారు.

# రోత రాజకీయాలు

● మునెమ్మ నిర్వేదం



రాష్ట్రంలో పార్టీలు స్వార్థపూరితంగా మారి కలుషితం కావడంతో రాజకీయాలకు స్వస్తి చెప్పినట్లు కోవూరు నియోజకవర్గంలో గత ఎన్నికల బరిలో ప్రజారాజ్యం పార్టీ నుంచి పోటీ చేసిన తుపాకుల మునెమ్మ స్పష్టం చేశారు. మనుబోలు రెవెన్యూ కార్యాలయానికి భూసమస్యలపై అధికారులతో మాట్లాడేందుకు వచ్చిన ఆమె మాట్లాడుతూ ఇకపై రాజకీయాల్లోకి రానన్నారు. యానాదుల అభివృద్ధికి కృషి చేస్తానని చెప్పారు. చిరంజీవి తన పట్ల ఎంతో అభిమానం చూపించారని, అయితే పార్టీని కాంగ్రెస్‌లో విలీనం చేయడం ఇష్టంలేకనే బయటకు వచ్చానని, ఈ విషయాన్ని హైదరాబాద్‌లో చిరంజీవిని కలిసి చెప్పానన్నారు. జిల్లాలో మనుబోలు, కోట, వాకాడు, చిల్లకూరు, సైదాపురం, గూడూరు, ఓజిలి మండలాల్లో యానాదుల దీర్ఘకాలిక సమస్యలపై ప్రణాళిక సిద్ధం చేసుకొని పోరాడాలని నిర్ణయించుకొన్నట్లు వివరించారు. ఇకపై స్వార్థం, కుతం త్రాలతో నిండిన రాజకీయ పార్టీల్లో మాత్రం చేరేదిలేదని మునెమ్మ కుండబద్దలు కొట్టినట్లు చెప్పారు.

# గబ్బు పట్టిన కావలి సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసు

## అవినీతే అసలు రీతి



కావలి సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయం.

కావలి సబ్ రిజిస్ట్రారు కార్యాలయం అవినీతి మయమైంది. లక్షల రూపాయలు ముడుపులు అందుకొంటున్న అధికారులు, కొందరు బయటి వ్యక్తులతో కుమ్మక్కై పలు అక్రమాలకు పాల్పడుతుండడంతో పరిస్థితి అబందరగా మారింది. రియల్ ఎస్టేట్ వ్యాపారులతో కుమ్మక్కై ప్లాట్లుగా వున్న భూమిని వ్యవసాయభూమిగా చూపి రిజిస్ట్రేషన్ చేసేస్తున్నారు. కార్యాలయంలో సబ్‌రిజిస్ట్రారుగా పని చేస్తున్న వ్యక్తి గతంలో ఇక్కడే సస్పెండై తిరిగి అదే చోటుకు రాగలిగాడంటే ఆయన ఎంతగా అవినీతికి అలవాటు పడ్డాడో అర్థం చేసుకోవచ్చు. ఈ కార్యాలయం మొత్తాన్ని ముగ్గురు డాక్యుమెంటు రైటర్లు, ఒక స్టాంపు వెండర్ తమ కనుసన్నల్లో నడిపిస్తూ లక్షలరూపాయలు దోచుకతింటున్నారు. సబ్ రిజిస్ట్రారు మేము చెప్పినట్లు వింటాడంటూ ప్రతి పనికి రేటు పెట్టి వసూళ్లకు పాల్పడుతుండడంతో వివిధ పనులపై వచ్చే వాళ్లు వీరి దెబ్బకు హడలిపోతున్నారు.

దస్తావేజు విలువపై వన్ పర్సెంట్ లెక్కన లక్షకు వెయ్యిరూపాయలు బహిరంగంగా వసూలు చేస్తున్నా పట్టించుకొనే అధికారే లేకుండా పోవడంతో కార్యాలయంలో ప్రతిపనికి చేయితడపక తప్పడం లేదు.

# వ్యాక్సిన్లు భద్రపరచండి!

● జిల్లా ఇమ్యూనైజేషన్ అధికారి సలహా

ప్రభుత్వం సరఫరా చేసే వ్యాధినిరోధక టీకాలు, చిన్నారులకు, గర్భవతులకు వేస్తున్న ఇంజక్షన్లు తదితర మందులను భద్రపరచడంలో ఫార్మసిస్టులు శ్రద్ధ చూపాలని జిల్లా ఇమ్యూనైజేషన్ అధికారి డాక్టర్ జయసింహ సూచించారు. జిల్లా వైద్య ఆరోగ్యశాఖ కార్యాలయంలో ఫార్మసిస్టుల సమీక్షా సమావేశం నిర్వహించారు. అత్యంత విలువైన వ్యాక్సిన్‌లను వాటికి సంబంధించిన ఐఎల్ఆర్‌లో భద్రంగా ఉంచడంలో తగిన జాగ్రత్త వహించాలన్నారు. వ్యాక్సిన్లు, మందుల వినియోగానికి సంబంధించిన వివరాలను రికార్డుల్లో పొందుపరచాలన్నారు. అలాగే ఆయా మందులకు వున్న ఎక్స్‌పైరీడేట్‌ను రికార్డు చేయాలన్నారు. ఈ విషయంలో అశ్రద్ధ వహిస్తే తగిన చర్యలు చేపడుతామని హెచ్చరించారు. ఇటీవల మీజిల్స్, జెఈ వ్యాక్సిన్‌లను జిల్లాలోని అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు సరఫరా చేశామన్నారు. కొన్ని చోట్ల వీటిని సక్రమంగా వినియోగించకుండా, నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నట్లు ఫిర్యాదులు అందుతున్నాయన్న ఆయన ఆయా ప్రాంతాల సిబ్బందిపై ఆగ్రహించారు. టీకాలను వేసే కార్యక్రమాన్ని ప్రతి బుధ, శనివారాల్లో సక్రమంగా చేపట్టాలన్నారు.



# కార్మికులకు గుర్తింపు కార్డులు!

## ఐజి హరీష్‌కుమార్ గుప్తా సూచన

జిల్లావ్యాప్తంగా వివిధ పరిశ్రమల్లో పనిచేస్తున్న ఇతర రాష్ట్రాలకు చెందిన కార్మికులకు గుర్తింపుకార్డులు అందజేస్తామని గుంటూరు రేంజ్ ఐజి హరీష్ కుమార్ గుప్తా ప్రకటించారు. ఈ విషయమై పరిశ్రమల యాజమాన్యాలతో చర్చించి అవసరమైన చర్యలు తీసుకొంటామన్నారు. చిల్లకూరు పోలీస్‌స్టేషన్‌ను తనిఖీ చేసిన ఆయన పోలీసులకు పలు సూచనలు చేశారు. కార్మికులకు గుర్తింపు కార్డులు మంజూరు చేయడం వలన సంఘవ్యతిరేక శక్తులను సులువుగా గుర్తించే వీలుంటుందన్నారు. జిల్లాలో వివిధ మండలాల్లో పోలీస్ క్వార్టర్ల నిర్మాణానికి తగినచర్యలు చేపడుతామన్నారు. చిల్లకూరు పోలీస్ స్టేషన్‌కు అనుబంధంగా నివాస గృహాలను నిర్మించేందుకు అవసరమైన ప్రతిపాదనలను పంపాలని జిల్లా ఎస్పీ రమణకుమార్‌కు సూచించారు. విధులు సక్రమంగా నిర్వహించి ప్రజలతో మమేకం కావాలని, ప్రజల మన్ననలు పొందాలని పోలీస్ సిబ్బందికి హితబోధ చేశారు. ఐజి వెంట ఎస్పీ రమణకుమార్, ఎఎస్పీ నారాయణరెడ్డి, ట్రైనీ డిఎస్పీ పరమేశ్వర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

● స్కూళ్లకు

# ఎగనామం పెడుతున్న అయ్యోర్లు!

కావలి, ఉదయగిరి నియోజకవర్గాలలో పలు పాఠశాలల ఉపాధ్యాయులు విధులకు దుమ్మాకొట్టడంతో విద్యాబోధన కుంటుపడుతోంది. చుట్టపు చూపుగా వచ్చే అయ్యోర్లతో పిల్లలకు పాఠాలు ముందుకు సాగని పరిస్థితి ఎదురౌతోంది. టీచర్లు రాకపోవడంతో పలు పాఠశాలల్లో విద్యార్థులే ఉపాధ్యాయులుగా అవతారం ఎత్తుతున్నారు. కావలి, అల్లూరు, బోగోలు మండలాల్లో ఇలాంటి సమస్య అధికంగా వుంటోంది. విద్యావాలంటీర్లు అందుబాటులో వున్న పాఠశాలల్లో ఉపాధ్యాయుల హాజరు శాతం అతి స్వల్పం. ఇవి కాక కొండక్రింద పల్లెల్లోని పాఠశాలల పరిస్థితి మరీ దారుణంగా వుంది. సీతా

## కావలి, ఉదయగిరి నియోజకవర్గాలలో యింతే...

రాంపురం, కనిగిరి, కొండాపురం, వింజమూరు, జలదంకి, తొమ్మిదవమైలు, చామదల, గుడ్లదొన, బ్రాహ్మణక్రాక గ్రామాల్లోను ఇదే పరిస్థితి ఎదురౌతోంది. గురువులు ఎప్పుడు వస్తారో, బడులు ఎప్పుడు తెరచుకొంటాయో తెలియని స్థితి నెలకొనిందని గ్రామస్థులు చెప్తున్నారు. ఇంత జరుగుతున్నా విద్యాశాఖ అధికా రులు మాత్రం వారంలో నాలుగురోజులు ఆకస్మిక తనిఖీలంటూ తిరగడం, ఫోటోలకు ఫోజులివ్వడం తప్ప దారితప్పిన అయ్యోర్లను గాడిలో పెట్టే చర్యలు చేపట్టకపోవడంతో పాఠశాలలు మూతపడిపోతున్నాయి.

# ఆదాల అపర్ణ ఆరంగేట్రం!

- రవీంద్రభారతిలో ఆకట్టుకొన్న భరత నాట్య ప్రదర్శన!

నృత్య కళలన్నింటిలోకి శిఖర ప్రాయమైనది భరతనాట్యం. దాన్ని నేర్చుకోవడం కష్టం. రస పిపాసుల మనసులు రంజింప చేసే తీరులో ప్రదర్శించడం ఇంకా కష్టం. ఎన్నో ఏళ్ల అభ్యాసం వుంటే తప్ప వేదిక మీద భరత నాట్య నృత్యకారిణులు చూపరుల చప్పట్లు అందు కోలేరు. అదొక దైవికమైన కళ. పూర్వజన్మ సుకృతంతోనే సాధ్యం.

ఆదాల రాఘవరెడ్డి తనయ కుమారి ఆదాల అపర్ణ హైదరాబాద్ రవీంద్రభారతి ఆడిటోరియంలో భరతనాట్యంలో ఆరంగేట్రం ప్రదర్శన ఇచ్చింది. అత్యద్భుతమైన ప్రదర్శన అది. నాట్యం నేర్చుకొని, తొలి ప్రదర్శన ఇస్తున్న భావన చూసేవారెవరిలోనూ కలగలేదు. ఎంతో రాటుదేలిన నృత్యకళాకారిణి వలె కనిపించిందా పసికూన. గొప్పింటి పిల్లలలో కళల పట్ల ఆరాధన కలగడమే అరుదైన విషయం. దానిలో ప్రావీణ్యత సాధించాలనే పట్టుదల, అంకిత భావం, అభ్యాసం పట్ల చిత్తశుద్ధి మరింత కరువైన అంశాలు. కానీ ఆదాల అపర్ణ ఆరంగేట్రం చూస్తే, ఆమెలో ఎంతటి కళాపిపాస వుందో అని ఆశ్చర్యం కల్గింది. కఠోరమైన సాధన చేస్తే తప్ప అంతగా రాణించడం జరగని పని. సంపన్న కుటుంబాలలోని పిల్లలలో ఆ దృఢ సంకల్పం నిజంగా అభినందించదగిన విషయం. సంకల్ప దారుఢ్యానికి రూప లావణ్యం జత కలవడంతో ఆరంగేట్రం ప్రదర్శన ఎంతగానో ఆకట్టుకొన్నది. బుగ్గన ముచ్చటైన సొట్ట, చేప పిల్ల కదలికల వంటి నేత్ర విన్యాసం, మెరిసే మేని ఛాయ, కళ్లుచెదిరే వజ్రపు సరాల మెరపులు కలగలసి అపర్ణకు అందరి దిష్టి తగిలింది.



ఆరంగేట్రానికి తొలి ఆశీర్వచనం అందించను విచ్చేసిన కేంద్ర మంత్రిణి దగ్గుబాటి పురంధేశ్వరి అదే మాట అన్నారు. పూర్వజన్మ సుకృతం వల్లనే అపర్ణలో ఇంతటి ప్రావీణ్యం తొణికిసలాడుతున్నదని అభినందించారు. శాంతాబయోటెక్ అధినేత పద్మభూషణ్ వరప్రసాద్ రెడ్డి, సినీ నటి సుమలత, ప్రఖ్యాత భరత నాట్య కళాకారిణి హేమ మాలిని ఆ బాలికను ఆశీర్వదించారు.

ఆదాల రాఘవరెడ్డి స్వతహాగా కళా పిపాసి. చేసే ప్రతి పని కళాత్మకంగా వుండాలని తపించే మనస్తత్వం. ఆయన ఇంట్లో విందు భోజనంలో కూడా కళాత్మకత తొణికిసలాడుతుంది. వ్యాపార ప్రపంచంలో తలమునకలై తనలోని కళాతృష్ణను తీర్చుకోలేక పోయాడింతకాలం. ఆ కొరత తన కుమార్తెతో ఒక జన్మకు సరిపడా నెరవేర్చు కొన్నాడన్పిస్తుంది. ఆదాల సోదరులలో ఆఖరివాడైన మురళీ కృష్ణారెడ్డి అదే మాట అన్నాడు. ఇంతకాలం, వ్యాపారాలలో వున్నతి చూసి మేమేదో సాధించామనే గర్వం వుండేది. కానీ అపర్ణ నృత్య కళాభినివేశం చూసిన తర్వాత మేము సాధించింది ఎంత తక్కువో అర్థమౌతున్నదని నిజం ఒప్పుకొన్నాడు. అపర్ణ ఆరంగేట్రం విశేషానికి ఇంతకంటే విశేషణం అక్కరలేదు.

## చాటుమాటు మాటలు

### క్షమాపణ కోరిన సుకుమార్




ఓ సీనియర్ ఐఎఎస్ అధికారి నోరు జారినందుకు తన కింద పనిచేసే అటెండర్‌కు క్షమాపణ చెప్పాల్సి వచ్చింది. వ్యవసాయ మార్కెటింగ్‌శాఖ కమిషనర్‌గా వుంటూ వివాదాస్పదుడైన ఎ.ఆర్. సుకుమార్‌ను ల్యాండ్ రెవెన్యూ స్పెషల్ కమిషనర్‌గా బదిలీ చేశారు. కొత్త పోస్టులో చేరిన సుకుమార్ తన అటెండర్‌ను అమర్యాదగా పిలిచాడట. దాంతో ఆ శాఖ అటెండర్లంతా కలిసి సుకుమార్‌కు తమ నిరసన వ్యక్తం చేశారు. ఈ గొడవ ముదురుతుండటంతో సుకుమార్ దిగివచ్చి తన ప్రవర్తనకు క్షమాపణ చెప్పాడట. దాంతో అటెండర్లు శాంతించి, మొదటి తప్పుగా భావించి వదిలేశారు. ఐఎఎస్ అయినా అటెండర్ అయినా మర్యాద... మర్యాదేగా!

### కెసిఆర్‌కు కొండంత తలనొప్పి



టిఆర్ఎస్ అధినేత కెసిఆర్‌కు కొండా లక్ష్మణ్ బాపూజీ రూపంలో కొండంత తలనొప్పి పట్టుకుంది. తెలంగాణ ఉద్యమం ఇప్పటికే బహునాయకత్వంతో సతమతమవుతుండగా కొండా లక్ష్మణ్ నాయకత్వంలో మరో పోరాట వేదిక తయారైంది. ఇందులో పార్టీ రహితంగా నాయకులంతా చేతులు కలిపారు. టిఆర్ఎస్‌తో అసంతృప్తిగా వున్న వారంతా క్రమంగా కొండా వేదికలో చేరుతున్నారు. దీంతో కెసిఆర్‌కు కొత్త రాజకీయ ప్రత్యమ్నాయం బలంగా తయారవుతోంది. దీనివల్ల తెలంగాణ ఉద్యమంలో కెసిఆర్ నాయకత్వానికి సవాళ్లు ఎదురవుతున్నాయి. బంద్‌లు, ఆందోళనకు ఏకపక్షంగా పిలుపు నివ్వడం వల్ల ఇతర వేదికల నాయకులు సహకరించడం లేదు. దీంతో కెసిఆర్‌కు ఎక్కే గడప... దిగే గడప కష్టాలు ఎదురవుతున్నాయి.

### గవర్నర్ కార్యదర్శి 'విందు' రాజకీయం



గవర్నర్ కార్యాలయం ఐఎఎస్ అధికారుల రాకపోకలతో కళకళలాడుతోంది. అయితే ఐఎఎస్‌లంతా గవర్నర్‌ను కలవటానికి వస్తున్నారనుకుంటే మీరు తప్పులో కాలేసినట్లే. గవర్నర్ కార్యదర్శి రమేష్ కుమార్ ఇచ్చే విందులకు హాజరయ్యేందుకు ఐఎఎస్‌లంతా బారులు తీరుతున్నారు. గవర్నర్ క్యాంపుకెళ్లినపుడో... గవర్నర్ రాజ్‌భవన్‌లో లేనపుడో రమేష్ కుమార్ తన సహచర ఐఎఎస్‌లకు పసందైన విందు భోజనాలు పెడ్తున్నాడు. పనిలో పనిగా సచివాలయంలో ఏం జరుగుతున్నదీ... రాజకీయాలేమిటి? అన్న విషయాల్ని కూడా ఐఎఎస్‌ల నుంచి రాబడుతున్నాడట. అవునుమరి రేపు ఎటుపోయి ఎటువస్తుందో! ఒక వేళ రాష్ట్రపతి పాలన వస్తే? ముందుగానే ఐఎఎస్‌లతో సంబంధాలు పెంచుకుంటే తర్వాత తమ పని సులువు అవుతుందని రమేష్ భావిస్తున్నారేమో! మొత్తానికి రమేష్ విందులు మాత్రం ఐఎఎస్ వర్గాల్లో హాట్‌టాపిక్‌గా మారాయి.

### శంకర్రావ్ కాదు వంకర్రావ్!!

చేనేత మంత్రి శంకర్రావ్ తోటి మంత్రులకు తలనొప్పిగా తయారయ్యాడు. తాను వివాదాల్లో కూరుకొని తమకు ఇబ్బందుల్ని కలిగిస్తున్నాడంటూ మంత్రులంతా మొర పెట్టుకుంటున్నారు. జగన్ అక్రమ ఆస్తులు సంపాదించాడంటూ కోర్టుకెక్కాడు. అంతటితో వూరుకోకుండా తన ఆస్తులపై విచారణ జరిపించాలంటూ స్వయంగా లోకాయుక్తకు లేఖ వ్రాశాడు. లోకాయుక్త కూడా అందుకు అంగీకరించింది. రాష్ట్రమంత్రిపై ఈ విధంగా లోకాయుక్త విచారణ జరగడం ఇదే మొదటిసారి. మంత్రుల ఆస్తులపై విచారణకు శంకర్రావు దారి చూపించాడంటూ మంత్రులు మొత్తుకుంటున్నారు. లోకాయుక్త విచారణ శంకర్రావుతోనే ఆగుతుందా? లేక మంత్రులందరిపైనా పడుతుందా? అని మంత్రులు చెవులు కొరుక్కుంటున్నారు.



# వరలక్ష్మీ వ్రతంతో భోగభాగ్యాలు!



శ్రీ హరికి, లక్ష్మీదేవికి ఎంతో ప్రీతి పాత్రమైన మాసం శ్రావణ మాసం. పర్వదినాల మాసంగా పిలువబడే శ్రావణంలో వచ్చే శుక్రవారాలన్నీ విశేషమైనవే అయినప్పటికీ పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు వరలక్ష్మీవ్రతాన్ని ఆచరించడం అనాదిగా వస్తున్న ఆచారం. దీనికి ఎంతో విశిష్టత వుంది. స్త్రీ సౌభాగ్యం కోసం సిరులిచ్చే లక్ష్మీదేవి ఉపదేశించింది గనుక ఈ వ్రతాన్ని ఎంతో మహిమాన్వితమైనదిగా స్కందపురాణంలో వివరించబడింది. దీనిని పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పగా ఆవిధంగా హిమపుత్రి వరలక్ష్మీ వ్రతం చేసి లక్ష్మీదేవి అనుగ్రహం పొందినట్లు భవిష్యపురాణంలో చెప్పబడింది.

## వ్రతవిధానం

వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరించే మహిళలు ఇంటిని శుభ్రపరచి, ముగ్గులుపెట్టి, గడపకు పసుపు, కుంకుమలు వాకిళ్లను మామిడి తోరణాలతో అలంకరించుకోవాలి. సూర్యోదయానికి ముందే తలస్నానం చేసి కొత్తబట్టలు కానీ శుభ్రమైన వస్త్రాలు కట్టుకొని పూజకు సిద్ధం చేయాలి. పూజా మండపంలో బంగారు, వెండి లేదా మట్టితో లక్ష్మీదేవి ప్రతిమను తయారుచేసి కలశం పెట్టి అందులో కొబ్బరికాయ వుంచాలి. రవిక, అక్షితలు, పంచామృతాలు, తొమ్మిది రకాల వంటకాలను సిద్ధం చేసుకొని పూజ ఆరంభించాలి. ముందుగా గణపతి పూజ చేసి తర్వాత అమ్మవారికి షోడశోపచార పూజ చేయాలి. ఇష్టదైవాన్ని 16రకాల ఉపచారాలతో పూజించడాన్ని షోడశోపచార పూజ అంటారు. లక్ష్మీదేవికి అష్టోత్తర పూజ చేసిన అనంతరం పూజకు ముందు సిద్ధం చేసుకొన్న తొమ్మిది తోరాలను లక్ష్మీదేవి వద్ద వుంచి పూజించి ఒకటి దేవీమాతకు సమర్పించి, రెండవది వ్రతం చేసేవారు కుడిచేతికి కట్టుకోవాలి. ముత్తయిదువులకు రవిక, తాంబూలం వాయనంగా ఇవ్వడంతోపాటు తోరాలను కట్టి వారి దీవెనలు పొందాలి.




షుగర్ వ్యాధిగ్రస్తులకు
సంజీవని జెరిటిన్-డి

ఈ వ్రతానికి సంబంధించి కథ ఒకటి ప్రచారంలో వుంది. మగధ దేశంలో చారుమతి అనే స్త్రీకి కలలో లక్ష్మీదేవి సాక్షాత్కరించి శ్రావణ మాసంలో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు నన్ను పూజిస్తే సిరిసంపదలు, ఆయురారోగ్యాలు సిద్ధిస్తాయని చెప్పిందట. ఆ విధంగా చారుమతి వ్రతాన్ని ఆచరించడం వలన లక్ష్మీదేవి అనుగ్రహం లభించి అష్టైశ్వర్యాలు సిద్ధించినట్లు చెప్తారు. వ్రతం సందర్భంగా ఈ కథను చెప్పడం జరుగుతుంది. ఆగస్టు 12న వచ్చే శుక్రవారంనాడు వరలక్ష్మీ వ్రతాన్ని నిష్టగా చేసిన వారికి భోగభాగ్యాలు, సమస్త శుభాలు చేకూరుతాయని, పుణ్యం లభిస్తుందని పురాణాలు చెప్తున్నాయి.

## ట్రంకు రోడ్డు కబుర్లు

### వివేకా బ్రాండ్...



నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి పలు వ్యాపార, విద్యా సంస్థలకు బ్రాండ్ అంబాసిడర్‌గా మారారు. దీనికిగాను ఆయా సంస్థలు పారితోషికం ఇస్తున్నాయో లేదో తెలియదుగానీ కార్పొరేషన్, పోలీసు అధికారులు మాత్రం ఈ సంస్థల జోలికి వెళ్లను ధైర్యం చేయరు. ఆర్టీసి బస్టాండ్ దగ్గర ముస్లిం సోదరులకు రంజాన్ సందర్భంగా శుభాకాంక్షలు తెలియజేస్తూ ఓ వస్త్ర వ్యాపార సంస్థ హోర్డింగ్ పెట్టింది. దీనితో వ్యాపార వివరాలకన్నా వివేకా ముస్లిం గెటప్పులో వున్న ఫోటో పెద్దదిగా పెట్టింది. నర్తకి సెంటర్‌లోని ఓ కస్టమ్స్ షాపు నిర్వాహకుడు కాస్త ముందుకెళ్లి షాపు బోర్డుపైనే వివేకా ఫోటో పెట్టేశాడు. వన్‌టౌన్ ఎదురుగా వుండే ఫోటో స్టూడియో ముందైతే వివేకా రకరకాల గెటప్పుల ఫోటోలు చూస్తూ నిలబడిపోవాల్సిందే. నగర కాంగ్రెస్ అధ్యక్షుడు నడిపే స్కూల్ హోర్డింగులలోనూ వివేకానే బ్రాండ్ అంబాసిడర్‌ను చేసిన విషయం ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

### దేనికెళ్లాలి!



నెల్లూరు నగరంలోని కళాభిమానులు ఈ వారం పెద్ద సంకటాన్ని ఎదుర్కొన్నారు. నగరంలో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలకు తీరిక చేసుకొని ఓపిగ్గా వెళ్లేవారున్నారు. అయితే వచ్చిన చిక్కల్లా టౌన్ హాల్‌లో కామేశ్వరరావు మెమోరియల్ నాటక పరిషత్ పోటీలు, కస్తూరిబా కళాక్షేత్రంలో ఆదాల నృత్య కళాపీఠం నేతృత్వంలో ఏర్పాటైన మువ్వల రవళి కార్యక్రమాలు ఒకే సమయంలో జరగడం. 4తేదీ మొదలైన ఈ కార్యక్రమాలు 7తేదీ వరకు జరిగాయి. కొంతసేపు కూచిపూడి నృత్యం చూసి, ఆ తర్వాత నాటకాల దగ్గరకు వచ్చి మొత్తానికి రెండు కార్యక్రమాలను జయప్రదం చేశారు. ఇదీ నెల్లూర్రీయుల గొప్పతనం.

### భోజనమెలా పెడతారు?



నగరంలో ఓ ఇడ్లీని ఎనిమిది రూపాయలకు, సింగిల్ చాయ్‌ని ఐదు రూపాయలకు అమ్ముతున్నారు. మెస్‌లో సైతం ప్లేటు భోజనం ముప్పై రూపాయలపై మాటే. అటువంటిది స్కూల్ పిల్లలకు మధ్యాహ్న భోజనం పెట్టను ప్రభుత్వం ఒక్కొక్కరికి 3 రూపాయల 84పైసలు విడుదల చేస్తోంది. ఈ మొత్తంలోనే వారానికి రెండుసార్లు కోడిగుడ్లు పెట్టమంటుంది. వివిధ రకాల అభివృద్ధి పనులకంటూ ముందూ వెనుక చూడకుండా కోట్లాది రూపాయలు మంజూరు చేసే ప్రభుత్వ పెద్దలు భోజనానికి తాము మంజూరు చేస్తున్న మొత్తంతో పిల్లల ఆకలి ఎలా తీరుతుందని తెలియక పోవడం బాధాకరం.

# వారఫలాలు

తేది 13–8–2011 నుండి 19–8–2011 వరకు కర్కాటక, సింహాల్లో రవి, శుక్రులు; సింహంలో బుధుడు; మేషంలో గురువు; మిథునంలో కుజుడు; వృషభంలో కేతువు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; మకర, కుంభ, మీన, మేషాల్లో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

చాలా ప్రోత్సాహకరమైన కాలం. వృత్తి రీత్యా ఉత్సాహం అధికమవుతుంది. ప్రయాణాలలో జాగ్రత్త. అనుకొన్న పనులు అనుకొన్నరీతిలో సాగుతాయి. సంతానమూలంగా సుఖశాంతులు లభిస్తాయి. వారి విద్యారంగం ప్రోత్సాహకరంగా వుంటుంది. ధన విషయంలో లోటుండదు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. పురోభివృద్ధి అన్ని రంగాలలో వుంటుంది. రాజకీయులకు అత్యంతం అనుకూలమైన కాలం.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

మిత్రులు సాయమందిస్తారు. పద్ధతి ప్రకారం పనులు నిర్వహిస్తారు. ప్రయాణాలు సుముఖంగా సాగుతాయి. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా వుంటాయి. ఇన్నాళ్ళు ఆటంకాలతో అడ్డుపడ్డ పనులు ఊపందుకొంటాయి. నూతన ఉద్యోగావకాశాలు లభించవచ్చు. భూ భవనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం. రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

తల్లి ఆరోగ్యం జాగ్రత్త. వాహనాలు జాగ్రత్తగా నడపాలి. అనుకొన్న పనులన్నీ అనుకొన్నరీతిలో ప్రణాళికాబద్ధంగా జరుపుకొంటూపోతారు. ఉద్యోగవృద్ధి. వేతనవృద్ధి వుంటుంది. ఇంతవరకు వుంటూ వచ్చిన ఇబ్బందులు తొలగుతాయి. చిరకాలంగా ఎదురుచూస్తూ వచ్చిన శుభఫలితాలు అనుభూతిలోనికి వస్తాయి. శత్రువులు లొంగి నడచు కొంటారు. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనిని ప్రతిష్ఠాత్మకంగా పూర్తిచేస్తారు. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం ఉన్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేత మవుతాయి. సంతానం విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికాబద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు. అకారణ విరోధాలు తలెత్తే ప్రమాదం కూడా ఉంది.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

వ్యవహార జయం, ఆరోగ్యసిద్ధి, అనుకూల ప్రయాణాలు కలుగుతాయి. స్త్రీలు తమ ఆరోగ్యం పట్ల జాగ్రత్త వహించాలి. సోదరుల మూలంగా ఖర్చు. వ్యాపారులకు మొదట అంతంతమాత్రంగానే వున్నా తర్వాత లాభాలు వస్తాయి. వారం మొదట్లో ధనలాభం, ఉద్యోగులకు పరీక్షా కాలం. సహనం, సంయమనం అవసరం. కుటుంబ సభ్యులతో చిన్నపాటి మాట పట్టింపులు, అభిప్రాయ భేదాలు కలుగుతాయి.



**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతి ఫలం తప్పక పొందుతారు. తలకు సంబంధించిన అనారోగ్యం వచ్చే సూచనలున్నాయి. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు.



**తుల**
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనిని ప్రతిష్ఠాత్మకంగా పూర్తిచేస్తారు. కుటుంబంలో అశాంతి, అసౌఖ్యం వున్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేత మవుతాయి. సంతానం విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికాబద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు. అకారణ విరోధాలు తలెత్తే ప్రమాదం కూడా ఉంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

పొత్తికడుపుకు సంబంధించి ఇబ్బంది ఉండవచ్చు. జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. నోరు పారవేసుకోకుండడం మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

పాదాలకు సంబంధించిన బాధలతో పాటు మర్మావయవ బాధలుంటాయి. సాధారణంగా గడచిపోతుంది. కళత్రంతో గొడవలుంటాయి. ఆర్థికవిషయాలు చక్కగా ఉంటాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. తండ్రి తండ్రివంటివారికి ఇబ్బందులుండవచ్చు. శ్వేత ప్రదరం బాధించవచ్చు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

కళత్ర సౌఖ్యం, మానసికానందం కలుగుతాయి. సోదరవర్గ బలం మీకు బాగా కలిసివస్తుంది. పరోపకార తత్వంతో మెలుగుతారు. నమ్మిన అనుచరులే మీకు వెన్నుపోటు పొడిచే ప్రమాదం వుంది. మెలకువగా వ్యవహరించండి. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. ప్రయాణాలు అనుకూలిస్తాయి. రాజకీయ నాయకులు అసంతృప్తి, అసహనంతో వుంటారు. జాగ్రత్త వహించండి.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం వుంటుంది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతి ఫలం తప్పక పొందుతారు. తలకు సంబంధించిన అనారోగ్యం వచ్చే సూచనలున్నాయి. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

ఆహార సౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, అనుకూల ప్రయాణాలు, బంధుమిత్రుల కలయికతో ఉల్లాసంగా ఉంటారు. క్రయవిక్రయాలు మీకనుకూలంగా జరుగుతాయి. కళాకారులకు, ప్రముఖులకు శుభవార్తలు అందుతాయి. విద్యార్థులకు మంచి కాలం. గతంలో చేసిన తప్పిదాలను, విశ్లేషించుకొనే పనిలో పడుతారు. చక్కని వ్యవహార జ్ఞానంతో వివిధ రంగాల్లోని వ్యక్తులను ఆకర్షిస్తారు.

## పంచాంగం

13 తేది జంధ్యాల పౌర్ణమి రాఖీ పండుగ.

15 తేదీ భారత స్వాతంత్ర్య దినోత్సవం.

### శుభ ముహూర్తాలు

13, 14, 15, 17, 18, 19 తేదీలలో సింహ లగ్నాన ఉ.6.30 నుండి 8.30గంటల వరకు. తులా లగ్నాన ఉ11.00 నుండి 01.00 గంటల వరకు సాధారణ శుభ ముహూర్తాలున్నాయి.

### జూలై తిథులు
శ్రావణ బహుళ

| | | | |
|---|---|---|---|
| 13 | శని | పౌర్ణమి | రా 01.20 గం.ల.వ |
| 14 | ఆది | పాడ్యమి | రా 12.10 గం.ల.వ |
| 15 | సోమ | విదియ | రా 04.35 గం.ల.వ |
| 16 | మంగళ | తదియ | రా 02.56 గం.ల.వ |
| 17 | బుధ | చవితి | తె 04.50 గం.ల.వ |
| 18 | గురు | పంచమి | పూర్తిగా |
| 19 | శుక్ర | పంచమి | ఉ 06.56 గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# ఈశాన్యం పడకగది పనికిరాదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*వై.రాధికా రమణ — హైదరాబాద్*

★ *ఓ టీవీ ఛానల్ వాస్తు జవాబుల్లో చాలా వాటిని ప్రాథమిక జ్ఞానం వున్న వారు కూడా ఖండిస్తున్నారు. గృహప్రవేశం రోజు గోవును చుట్టూ తిప్పాలా?*

రెండు, మూడు ఛానల్స్ కార్యక్రమాల్లోని జవాబుల్ని కొందరు శ్రోతలు పంపించారు. వాస్తు శాస్త్రం పట్ల వాస్తు చెబుతున్న వారికి అవగాహన లేదని నాకనిపించింది. విశ్వామిత్ర వాస్తులో గృహప్రవేశం రోజు గోవును సింహద్వారం గుండా గృహ ప్రవేశం చేయించాలని వుంది. గృహ ప్రదక్షిణం గురించి నేనెప్పుడూ వినలేదు.

*ఎన్.లక్ష్మీసుప్రసన్న — చెన్నై*

★ *అమ్మాయి విషయం చాలా తీవ్రంగా వుంది. మీ సలహా ఇవ్వండి.*

ముందుగా అన్ని విచారణల తర్వాత అమ్మాయిని ఇవ్వవలసింది. ఇప్పుడు గోమేధుకం (ద్వితీయార్థ) కుడి చిటికెన వ్రేలికి ధరింపజేసి పంచముఖ రుద్రాక్షకు 'శివార్చన' మండలం రోజులు గృహంలో చేయండి. ఫలితం లేకపోతే చట్టపరంగా ప్రొసీడ్‌కండి!

*పువ్వాడ విజయమ్మ — సికింద్రాబాద్*

★ *అమ్మాయి కాపురం చక్కబడింది. యంత్ర ప్రతిష్ట తర్వాత వాళ్లంతట వాళ్లే తప్పును ఒప్పుకున్నారు.*

యంత్ర బీజాక్షరాలు చాలా శక్తివంతమైనవి. ఆ ప్రభావాన్నుంచి ఎవరూ తప్పించుకోలేరు.

*షేక్ రమీజాబేగం — సికింద్రాబాద్*

★ *మీరు టీవీ వాస్తు కార్యక్రమాలు, వాస్తు సమాధానాలు చూశారా? మీ అభిప్రాయం ఏమిటి?*

అందులో చాలా ఛాందస భావాల్ని, ప్రాథమిక అధ్యయనం కూడాలేని భావాల్ని గమనించాను. మీరు ఆయా అంశాలను బట్టి టీవీ ఛానళ్లకు మీ అభిప్రాయం తెలియజేయవచ్చు.

*ఎమ్.శంకరరెడ్డి — నెల్లూరు*

★ *ఆత్మహత్యలు చేసుకున్నవారు 'ఆత్మ'లుగా మారుతారా?*

భారతీయ శాస్త్రాలు 'ఆత్మ'ల్ని నమ్ముతున్నాయి. రష్యా శాస్త్రజ్ఞులీమధ్య ఆత్మల ఫోటోలు కూడా తీశారు. ఆత్మలు భూత, ప్రేత, పిశాచాలని మూడు విధాలు. హత్యలకు, ఆత్మహత్యలకు గురైనవారు పిశాచాలవుతారని 'తంత్ర' శాస్త్రాలు చెబుతున్నాయి.

*ధూపాటి అశోక్‌శాస్త్రి — కర్నూలు*

★ *ప్రాచీన జ్యోతిష శాస్త్రాలలో ప్రముఖమైనవి ఏవి?*

మాండవ్య వచనం, స్మృతి సారావళి, జ్యోతిష ప్రకాశిక, జ్యోతిర్నిబంధం వంటి పద్దెనిమిది ప్రాచీన గ్రంథాలు చాలా ముఖ్యమైనవి. వేదాంగమైన జ్యోతిషం 1.సిద్ధాంత, 2.సంహిత, 3.హోర అని మూడు విభాగాలు.

*కె.కిరణ్‌నాయుడు — చెన్నై*

★ *ఈశాన్యంలో బెడ్‌రూం వుంది. ఆ ప్లాటు కొనవచ్చా?*

'బెడ్‌రూం'గా అది పనికిరాదు. పూజ, రీడింగ్ గదులుగా ఉపయోగించవచ్చు. ఆ గదిలో స్నానాల గది తప్ప లెట్రిన్ నిషిద్ధం.

*డి.కేశవనాయుడు — బెంగుళూరు*

★ *అపార్టుమెంటులో ప్లాటు వాస్తు బాగుంటే చాలా?*

అపార్టుమెంటులో బయట వాస్తు లేనపుడు దాని ప్రభావం కూడా అందరు గృహస్థులమీద వుంటుంది. అంచేత బయట, లోపల వాస్తు వుంటేనే కొనడం మంచిది.

*వి.లక్ష్మణారెడ్డి — చెన్నై*

★ *ఆయన ఎప్పుడూ అనారోగ్యంగా వుంటారు. ఏ చెడు అలవాట్లూ లేవు.*

తూర్పు, పశ్చిమ దిశాలోపాలున్నా ఇలా జరుగుతుంది. శని శత్రుస్థానం నీలం శ్రేష్ఠ కుడి ఉంగరపు వ్రేలికి ధరింప జేయండి. దేవుడి గదిలో 'సుదర్శన యంత్ర' ప్రతిష్ట చేయండి.

*టి.నారాయణశెట్టి — నెల్లూరు*

★ *అనేక మాసాలు మూతవేసిన ఇంట్లోకి వెళ్లడానికి పద్ధతులేమిటి?*

స్థలశుద్ధి, దోషహరణ పూజ, భూతబలి (టెంకాయ, నిమ్మకాయ, గుమ్మడికాయలు 12 చొప్పున) మండలం రోజులు దీపాల్ని ఆర్పకపోవడం. దేవుడి గదిలో 'సుదర్శన యంత్ర' ప్రతిష్ఠ.

# పేదల గుర్తింపు ఎలా?

పేదల గుర్తింపు సర్వేకు రాష్ట్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. స్వయం సహాయక సంఘాల్లోని సభ్యులతోపాటు ఇతర వర్గాలకు చెందిన వారి జీవన విధానంపై కూడా ఈ దఫా సర్వే జరుగనుంది. రాష్ట్రప్రభుత్వం జారీ చేసిన మార్గదర్శకాలు అర్థంకాక కొంత గందరగోళానికి గురవుతున్నారు అధికారులు. జారీ కాబడిన మార్గదర్శకాల్లో వున్న అంశాలను బట్టి ఎవరు పేదలుగా పరిగణించబడుతారు? ఎవరు పేదలుగా పరిగణించబడరన్న విషయాన్ని మాత్రం పేర్కొన లేదు.

కేవలం సర్వే చేసి నివేదికలు పంపిటే అందులోని అంశాలను పరిశీలించి ఆతర్వాత పేదలుగా గుర్తించిన వారి జాబితాను ఉన్నతాధికారులు ప్రకటిస్తారని ఇక్కడ అధికారులు చెబుతున్నారు. గత తెలుగుదేశం ప్రభుత్వహయాంలో ఏర్పాటు చేయబడిన వెలుగు సిబ్బంది ద్వారా గ్రామీణ ప్రాంతాలతోపాటు పట్టణ ప్రాంతాల్లో కూడా పేదలను గుర్తించే సర్వేను చేపట్టారు. అప్పట్లో గుర్తించబడిన వారికే నేటికీ ప్రభుత్వ రాయితీ పథకాలు అందుతున్నాయి. దాదాపు 10 సంవత్సరాల అనంతరం ఇప్పుడు పేదల గుర్తింపు సర్వే చేపట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది.

> “ జిల్లాలో పేదల గుర్తింపుకు గ్రామీణాభివృద్ధిశాఖ, పేదరిక నిర్మూలన సంస్థ అధికారులు నడుం బిగించారు. అయితే ఏ ప్రాతిపదికన పేదలను గుర్తిస్తారన్న విషయమై గందరగోళం నెలకొనివుంది. ”

### 25 అంశాల ప్రొఫార్మా!

ఇంటింటా సర్వే కార్యక్రమం నిర్వహించే సిబ్బందికి 25 అంశాలతో కూడిన దరఖాస్తు అందజేయనున్నారు. ఇందులో సొంత ఇల్లు, పక్కా ఇల్లు, అద్దె ఇల్లు, సెల్‌ఫోన్, కంప్యూటర్, ద్విచక్ర వాహనం, టి.వి. ఫ్రిజ్, ఎసి, కూలీ పని, ప్రైవేట్ వుద్యోగం, కాంట్రాక్టు వుద్యోగం, వ్యాపారం, బ్యాంకు రుణాలు పొందారా లేదా, తీసుకున్న రుణం బకాయి వుందా లేదా తదితర అంశాలు దరఖాస్తులో వున్నాయి. దరఖాస్తులో పేర్కొన్న అంశాలలో ఏవి లేని వాళ్లని పేదలుగా గుర్తిస్తారన్న సంగతి ఎవరికి తెలియడం లేదు.

ఇంతకు ముందు జరిగిన సర్వేపై అనేక ఆరోపణలు వచ్చాయి. పేదల గుర్తింపు సర్వే పారదర్శకంగా జరగలేదన్న విమర్శలు వున్నాయి. ఈ దఫా చేపట్టే సర్వేకు నియమించే సిబ్బందికి ముందుగా అవగాహన కల్పించేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. కుటుంబ సభ్యుల మొత్తం వివరాలను ఈ దఫా సేకరిస్తారు. ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల్లో చదివే విద్యార్థుల వివరాలను సైతం నమోదు చేసుకునే అవకాశం వుంది. ప్రభుత్వం రూపొందించిన మార్గదర్శకాల ప్రకారం ప్రస్తుతం పేదలుగా వున్నవారు ధనికులుగా మారిపోతారు.

సర్వే సక్రమంగా నిర్వహించినా ప్రజల్లో లేనిపోని సందేహాలు వ్యక్తంగాక తప్పదు. పేదలుగా నిర్ణయించే అధికారం ఈ దఫా రాష్ట్రస్థాయి అధికారులకు తప్ప జిల్లాస్థాయి అధికారులకు వుండదు. పేదల గుర్తింపు సర్వేపై గ్రామీణాభివృద్ధిశాఖ, పేదరిక నిర్మూలన సంస్థ అధికారులు సంయుక్తంగా పైఅంశాలను రూపొందించడం జరిగింది. ఏది ఏమైనా పేదలను గుర్తించే సర్వే ప్రారంభం కాక ముందే ఏర్పడిన గందరగోళ పరిస్థితులను నివృత్తి చేయాల్సిన బాధ్యత ప్రభుత్వంపై వుంది.



వీరు తప్ప నిఖార్సైన పేదలెవ్వరు?

---

**భూ పంపిణీ జరిగేనా?**

# జిల్లాలో సక్రమంగా జరగని భూ పంపిణీ!

రాష్ట్రప్రభుత్వం త్వరలో ఆరవవిడత భూపంపిణీ కార్యక్రమం చేపట్టాలన్న ఆలోచనలో వుంది. రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారం చేపట్టిన తర్వాత ఐదు విడతలుగా భూపంపిణీ కార్యక్రమం జరిగింది. తొలివిడతలో చేపట్టిన కార్యక్రమం పెద్ద ఎత్తున విమర్శలకు దారితీసింది. రాష్ట్రంలో భూ సంస్కరణలు అమల్లోకొచ్చిన సమయంలో భూస్వాముల నుంచి భూముల్ని స్వాధీనం చేసుకుంది ప్రభుత్వం. స్వాధీనం చేసుకున్న భూముల్ని ఎస్సీ, ఎస్టీలతోపాటు బిసి వర్గాలకు చెందిన వారికి అప్పట్లో పంపిణీ చేశారు.

వీటిని సాగులోకి తీసుకురాలేని కొందరు ఎస్సీ, ఎస్టీలు ఆర్థిక ఇబ్బంది కారణంగా ఇతరులకు విక్రయించారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం బడుగు, బలహీన వర్గాల వారికి పంపిణీ చేసిన భూముల్ని విక్రయించకూడదు, కొనకూడదు. అయితే ఈ నిబంధనలు గ్రామీణ ప్రాంతాల్లో ఎక్కడా అమలు జరగవన్న విషయం అందరికి తెలిసిందే. వీటిపై ఆరోపణలు, విమర్శలు రావడంతో అసైన్‌మెంట్ భూములలో కొన్నింటిని రెవెన్యూ అధికారులు స్వాధీనం చేసుకొని భూపంపిణీ కార్యక్రమంలో అర్హులైన వారికి పంపిణీ చేయడం జరిగింది.

ఈ విధంగా తొలివిడత భూపంపిణీ కార్యక్రమంలో దాదాపు 14వేల ఎకరాలకుపైగా పంచారు. రెండవ విడత నుంచి కొంత మంద గించింది. ఆతర్వాత క్రొత్తగా వచ్చిన జిల్లా కలెక్టర్ ఈ కార్యక్రమం పట్ల పెద్దగా దృష్టి సారించలేకపోయారు. ఆపై నాలుగు విడతలుగా సాగిన భూపంపిణీల్లో ఆశించిన ఫలితాలు సాధించలేకపో యారు. దాదాపు 30 సంవత్సరాల క్రితం పంపిణీ చేసిన భూములనే పంచారే తప్ప అదనంగా ఏ ప్రాంతంలో కూడా ప్రభుత్వ భూముల్ని గుర్తించి పంపిణీ చేయలేకపో యారు. త్వరలో ఆరవ విడత భూపంపిణీ కార్యక్రమం ఎలా చేపడతారోనన్న సందేహాలు వ్యక్తమవుతున్నాయి.

అధికారిక లెక్కల ప్రకారం జిల్లాలో లక్ష ఎకరాలకు పైగా ప్రభుత్వ భూములున్నాయని రాజకీయ పక్షాల వాదన. పలు రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు ప్రభుత్వ భూములు ఏ ఏ ప్రాంతాల్లో వున్నాయన్న సమాచారంతో కూడిన వినతి పత్రాలను అధికారులకు అందజేసి వున్నారు. వీటిపై కాస్త దృష్టి సారించి సర్వే చేయించినా కూడా ప్రభుత్వ భూముల్ని గుర్తించే అవకాశం వుంటుంది. ఏ సమయంలోనైనా ప్రభుత్వం ఆరవవిడత భూపంపిణీ గురించి ప్రకటన చేసే అవకాశం వుంది. ఎస్సీ, ఎస్టీలకు ఎన్ని వేల రూపాయల రుణాలు అందించినా ఆర్థికంగా నిలదొక్కుకోలేకపోతున్నారు. ఒక ఎకరం మాగాణి భూమి కేటాయిస్తే జీవన ప్రమాణాలు మెరుగు పడే అవకాశం వుంటుంది.

తిరుపతి పార్లమెంటు సభ్యులు చింతామోహన్ ఇదే అభిప్రాయాన్ని లేవనెత్తారు. ఇటీవల జిల్లా కలెక్టర్‌ను కలసిన ఎంపి ఆరవ విడత భూపంపిణీ కార్యక్రమం తన పరిధిలో అన్ని అసెంబ్లీ నియోజకవర్గాల్లో ఎస్సీ, ఎస్టీలకు ఎక్కువగా భూపంపిణీ చేసేందుకు చర్యలు తీసుకోవాలని కోరారు. భూముల్ని పంచడంతోపాటు సాగులోకి తీసుకొచ్చేందుకు అవసరమైన అన్ని సదుపాయాలు కల్పించాలని సూచించారు. దీనికి అవసరమైన యాక్షన్ ప్లాన్‌ను తయారుచేయమని జిల్లా అధికారులను ఆదేశించారు. ఎంపి చేసిన ప్రతిపాదన మన జిల్లా అధికారులు ఎంతవరకు అమలు జరుపుతారో వేచి చూడాలి.

> **‘ జిల్లాలో ఇప్పటి వరకు ఐదు విడతలుగా జరిగిన భూ పంపిణీ కార్యక్రమంలో కేవలం 14వేల ఎకరాల భూమినే పంచారు. ప్రతిపక్షాలు మాత్రం లక్ష ఎకరాల ప్రభుత్వ భూమి వివిధ రూపాల్లో ఖాళీగా పడివుందని లెక్కలు చెప్తున్నారు. ఈ దశలో ఆరవ విడత భూ పంపిణీ ఆసక్తికరంగా మారింది. ’**

## దేనికైనా రెడీ...



హీరోయిన్ శ్రియకు 'డాన్ శీను' తర్వాత తెలుగు చిత్రాలు లేవు. ఇటీవల అల్లరి నరేష్, శర్వానంద్‌లు కలిసి నటించే చిత్రంలో చేయను ఒప్పుకొంది. తమిళంలో మాత్రం ఆమె చేతిలో రెండు చిత్రాలున్నాయి. మొన్నటి వరకు సరైన కథలు, పాత్ర లభించకే కొత్త చిత్రాలు అంగీకరించట్లేదని చెప్పిన శ్రియ ఇప్పుడు ఎలాంటి కథ అయినా ఫర్వాలేదు నటిస్తానంటుంది. ఈ మార్పు ఏమిటంటే; ఇప్పుడు టీనేజ్ లవ్ స్టోరీలు ఎలాగూ రావు. నేను రకరకాలుగా డిమాండ్‌లు చేస్తే వచ్చే వేషాలు కూడారావని అందుకే సర్దుకుపోతానంటుంది శ్రియ.

## మారిన అమృత!



మహేష్‌బాబు సరసన ఒకే ఒక చిత్రం అతిథిలో హీరోయిన్‌గా నటించిన అమృతారావు పూర్తిగా మారిపోయింది. జంతు సంరక్షణ సమితిలో సభ్యత్వం తీసుకొంది. అప్పటి నుంచి మనిషి తన స్వార్థం కోసమే జంతువులను వేటాడుతున్నాడు. ఆహారం కోసం బలి తీసుకొంటున్నాడు. ప్రకృతిలో ఎవరి జీవితం వారిది. అలా కాకుండా మరొక జాతిని చంపడం అనాగరికమంటుంది. జంతు సంరక్షణ సమితిలో సభ్యత్వం తీసుకొన్నాక శాకాహారిగా మారిపోయాను. నేను నిత్యం ధరించే బట్టలపైనా కొన్ని జంతు సంరక్షణ నినాదాలు ప్రదర్శిస్తూ జనం జంతు హింస విడనాడేలా ఆలోచింప చేస్తున్నానంటుంది అమృత.

## లారెన్స్‌కు అవకాశాలు!



కాంచనతో తెలుగు ప్రేక్షకులను భయపెట్టిన లారెన్స్‌కు రెండు మూడు చిత్రాలకు దర్శకత్వం వహించే ఛాన్స్ వచ్చింది. కృష్ణంరాజు, ప్రభాస్‌లతో 'రెబల్' చిత్రాన్ని రూపొందిస్తున్న ఆయనకు 'ఫుల్ మాస్' అనే చిత్రానికి దర్శకత్వం చేసే అవకాశం వచ్చింది. గతంలో మాస్ సినిమాతో దర్శకుడైన లారెన్స్ ఆ చిత్రానికి సీక్వెల్‌గా దీన్ని తెరకెక్కిస్తారా? అనే చర్చ ఫిల్మ్‌నగర్ వర్గాలలో మొదలయ్యింది. కాంచన తీసిన బెల్లంకొండ సురేష్‌నే ఫుల్‌మాస్ చిత్రానికి నిర్మాత.

## జాన్ అబ్రహాం వల!



తన ప్రేయసి బిపాస బసు దూరం కావడంతో జాన్ అబ్రహాం ఇప్పుడు ఒంటరిగానే గడుపుతున్నాడు. అలవాటుపడిన మనసు కదా... ఒంటరితనం భరించలేకపోతున్నాడు. ఒకరిద్దరు హీరోయిన్లను తనవైపు తిప్పుకోను వల విసురుతున్నాడు. హీరోయిన్లు ప్రియాంక చోప్రా, కరీనా కపూర్లలో ప్రియాంకానే బాగుంటుందన్నాడు. అందమే కాదు ఎలాంటి పాత్రకైనా న్యాయం చేసే సత్తా ఆమెకే వుంది. దోస్తానాలో మేమిద్దరం కలసి నటించాం. సెట్ మీద ఒక్కసారి చెప్తే చాలు పాత్రలో లీనమై పోతుందని తెగపొగుడుతున్నాడు. ప్రియాంకను పొగడవచ్చు. కరీనాను తక్కువ చేస్తూ మాట్లాడడమేమిటని ఆమె అభిమానులు జాన్ అబ్రహాంపై కారాలు మిరియాలు నూరుతున్నారు.

## కరీనా షాదీ

బాలీవుడ్‌లో జీరోసైజ్ భామగా గుర్తింపు తెచ్చుకున్న కరీనాకపూర్ – సైఫ్ అలీఖాన్‌ల ప్రేమ వ్యవహారం తెలియంది కాదు. ఎంతకాలం ఇలా ప్రేమించుకొంటూనే వుంటారని ఇంట్లోవాళ్లు, బయటవాళ్లు అడుగుతుండడంతో ఈ ప్రేమజంట పెళ్లికి పచ్చజెండా ఊపేసింది. ప్రస్తుతం కరీనా కొత్త చిత్రాలేవీ ఒప్పుకోవడం లేదు. చేతిలో వున్న ప్రాజెక్టులన్నీ త్వరగా ముగించేయాలని చూస్తోంది. సైఫ్ కూడా ఏజంట్ వినోద్ మినహా మరేచిత్రానికి కాల్షీట్స్ ఇవ్వలేదు. వచ్చే యేడాది ఫిబ్రవరి 14 అంతర్జాతీయ ప్రేమికుల దినోత్సవం రోజు పెళ్లి చేసుకొంటే ఎలా వుంటుందని ఆలోచిస్తున్నారట. సన్నిహితులు మంచి ముహూర్తమంటున్నారు. మరి ఏం జరుగుతుందో చూడాలి.



## బండ... మార్క్!



✍ అల్లూరు రహీం

నెల్లూరీయుడు దక్షిణాదిలో పలు భాషా చిత్రాలకు ఫైట్ మాస్టర్‌గా పనిచేసిన విజయన్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించి తీసిన చిత్రం మార్క్. ఫైట్ మాస్టర్‌గా విజయన్‌కు పరిశ్రమలో తిరుగులేదు. కానీ ఆయన దర్శకత్వంలో 'మార్క్'ను మాత్రం తలాతోకలేని చిత్రంలా తయారు చేశాడు. ఏదో తీయాలని, అది చేతకాక రీళ్లు చుట్టేసిన చిత్రం మార్క్. మాస్ మెచ్చే ఫైట్స్‌ను కూర్చే విజయన్ ఈ చిత్రాన్ని పూర్తిగా ఆ ప్రేక్షకులను దృష్టిలో పెట్టుకొని తీశాడనాలి. ఈ చిత్రంలోని ఇద్దరు హీరోయిన్లకు హీరో ఘాటు ముద్దులు పెడతాడు. ఓ హీరోయిన్ అయితే బికినీలో కనపడింది చాలదని శరీరంపై కొన్ని నూలుపోగులు చుట్టుకొని మరో సన్నివేశంలో కనపడుతుంది. హీరోయిన్ పాలుపితికే సన్నివేశాలూ ఈ కోవలోనివే. సెన్సార్ బోర్డులోని సభ్యులు, అధికారులు కళ్లుమూసుకొని దీనికి ఓకే చెప్పినట్లుంది. ప్రేక్షకులను కాస్త సంభ్రమాశ్చర్యాలకు గురిచేయను అడవిలో వెదురు చెట్ల స్మగ్లింగ్, అడవి మనుషుల జీవన విధానాన్ని ప్రత్యేకంగా చిత్రీకరించాడు. నదుల్లో బరువుపెట్టి ముంచే వెదురుగడలు ఒక్కసారిగా బయటకు తేలే సన్నివేశంతోపాటు గాలివాన వచ్చి పడవలపై అడవి మనుషులు చెట్టుకొకరు, పుట్టకొకరుగా అయ్యే సన్నివేశం చిత్రీకరణలో కెమెరామెన్ శశికుమార్ చూపిన ప్రతిభ ప్రశంసనీయం. నగరంలో తిరుగులేని రౌడీగా చలామణి అవుతుండే హీరో అడవికి ఎలా చేరాడన్న సన్నివేశంపై దర్శకుడు, ఎడిటర్ ఇద్దరూ పొరబడి ప్రేక్షకులకు తిక్కపట్టిస్తారు. వెన్నెలకంటి పాటలు వాటికి సుందర్.సి.బాబు కూర్చిన సంగీతం ఏడ్చినట్లుంది. చిత్రంలో ఫైట్స్ మీద పెట్టిన శ్రద్ధ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంపై విజయన్ పెట్టకపోవడంతో మార్క్‌ను సి క్లాస్ సెంటర్లలోని ప్రేక్షకులు మినహా మామూలు ప్రేక్షకులు చూడలేరు.

చిత్రకథలోనికి వెళ్తే నగరంలో పాల వ్యాపారం చేసుకొనే విఠల్(శ్రీహరి) కాలక్రమేణా పెద్ద రౌడీగా ఎదుగుతాడు. పల్లెటూర్ల నుంచి నగరానికి పారిపోయి వచ్చే పిల్లలను చేరదీసి వారి బాగోగులు చూస్తూ వారిచేత నాన్న అని పిలిపించుకొంటుంటాడు. ఈ పిల్లలను అతను అసాంఘిక కార్యకలాపాలకు ఉపయోగిస్తాడు. విఠల్ దగ్గర ఈ విధంగా వుండే పిల్లవాడే మార్క్(శబరీష్). పిల్లవాడుగా విఠల్ దగ్గర వుండే మార్క్ వెదురును అక్రమంగా నరికే అడవి మనుషులతో కలసి సహజీవనం చేస్తుంటాడు. ఈ బృంద నాయకి సివంగి (నివేదిత) మనసు కూడా దోస్తాడు... నీళ్లలో ముద్దులు కూడా పెడతాడు. తాము నదీ ప్రయాణంలో వుండగా తమ పడవపై గాయాలతో పడిన మార్క్‌ను రక్షించామని అడవి మనుషులు చెబుతుంటారు. ఓ ప్రమాదంలో గాయపడిన అడవిలోని చిన్నపాపను చికిత్స కోసం నగరానికి మార్క్, సివంగి బృందం తీసుకెళ్లగా రౌడీలంతా వీరి వెంట పడతారు. అప్పుడు జరిగిన కథ వెండితెరపై ఆవిష్కృతమవుతుంది. విఠల్ దగ్గర వుండే పాండు అతనిపై తిరగబడగా మార్క్ అతనిని అంతమొందించి విఠల్‌కు ఇంకా ఆప్తుడవుతాడు. కానీ విఠల్‌నే మార్క్ ప్రేమించిన దివ్య(పింకీ)ను చంపను ఆమె తండ్రి దగ్గర సుపారీ తీసుకుంటాడు. విఠల్ కొడుకు ఇంకాస్త ముందుకెళ్లి ఆమెను పాడుచేయాలనుకొంటాడు. ఈ విషయాలు తెలియని మార్క్ విఠల్ చెప్పినట్లు టెలిఫోన్ బూత్‌లో తనకు ఫోన్ చేస్తుండే దివ్యను వెనుకనుంచి కాల్చేస్తాడు. ఆ తర్వాత విషయాలన్నీ తెలుసుకొని పట్టరానంత ఆవేశంతో విఠల్, అతని కుటుంబాన్ని అంతమొందించడంతో చిత్రం ముగుస్తుంది.

చిత్ర సమీక్ష

చిత్రంలో శ్రీహరి పోషించిన పాత్ర అతనికి కొట్టినపిండి. నూతన నటుడు శబరీష్ హీరో పాత్రకు పరవాలేదనిపించాడు. వసపిట్టలా వాగే పాత్రలో హీరోయిన్ పింకీ, అడవి పిల్లగా నివేదిక బాగానే చేశారు. కానీ దర్శకుని అనుభవరాహిత్యం వల్ల ఈ చిత్రం బండ'మార్క్'లా తయారయ్యింది.

# కప్పిర శీనయ్య తీరేవేరు



నాలుగుకాళ్ల మండపం వద్ద భవనం పైనుంచి దూకే యత్నంలో శీనయ్య.

నగరంలోని మాజీ కార్పొరేటర్లలో ఆది నుంచి బిజెపికి చెందిన కప్పిర శ్రీనివాసులు వ్యవహారశైలి వివాదాస్పదం. తన డివిజన్‌లోని ప్రజలకు ఎంత దగ్గరగా మసలుతారో వివిధ సందర్భాల్లో ఆయన ప్రవర్తించే తీరు అంత సంచలనం రేకెత్తిస్తుంది. మునిసిపల్ సమావేశాల్లో తనకు మాట్లాడే అవకాశమివ్వకపోయినా, తానడిగిన అభివృద్ధి పనులు డివిజన్‌లో చేపట్టకపోయినా ఆయన తీవ్రంగా స్పందిస్తాడు. పక్కన వుండే టేబుళ్లు, గోడలకు తలబాదుకోవడం లాంటివి చేయడంతో పలుమార్లు శ్రీను తీవ్రంగా గాయపడి వున్నాడు. గతంలో త్రీటౌన్ పోలీస్ స్టేషన్‌లోనూ ఎస్‌ఐ తన మాటవినలేదని అక్కడ గోడకేసి తలకొట్టుకొన్నాడట. పలుమార్లు ఆత్మహత్యాయత్నం చేసి వున్న శ్రీనివాసులు ఇటీవల సంతపేటలో భవన నిర్మాణాలను మునిసిపల్ అధికారులు కూలగొట్టే సందర్భంలో ఓ భవనంపైకి ఎక్కి దూకుతానని బెదిరించడం కలకలం రేపింది. శ్రీను దూకుడు తెలిసిన స్థానికులు, అధికారులు భవనంపై నుంచి దూకినా దూకుతాడని ఆందోళన చెందిన వెనక్కు తగ్గడం ఆయన వ్యవహారశైలిని తెలియజేస్తోంది. మొత్తం మీద చిత్రవిచిత్రమైన మనస్తత్వం గల నేతలున్న నగరంలో కప్పిర రూటే సపరేటు.

# 20 సూత్రాల అమలులో నెం.1 కావాలి!

20 సూత్రాల అమలు కార్యక్రమంలో భాగంగా 2011 – 12 సంవత్సరంలో జిల్లాకు నిర్దేశించిన లక్ష్యాలను పూర్తిచేసి ప్రథమస్థానం పొందేలా జిల్లా అధికారులు కృషిచేయాలని 20 సూత్రాల కార్యక్రమం అధ్యక్షుడు డాక్టర్ ఎన్.తులసిరెడ్డి చెప్పారు. 5వ తేది గోల్డన్ జూబ్లీ హాల్‌లో 20 సూత్రాల కార్యక్రమం అమలు తీరును శాఖలవారీగా సమీక్షించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ 20 సూత్రాల కార్యక్రమం అమలులో 2010–11 సంవత్సరంలో దేశస్థాయిలో మన రాష్ట్రం, హిమాచల్‌ప్రదేశ్, రాజస్థాన్ సంయుక్తంగా మొదటి స్థానంలో నిలిచాయన్నారు. రాష్ట్రంలో నెల్లూరు జిల్లా మూడవ స్థానం సాధించిందన్నారు. దారిద్ర్యరేఖకు దిగువనున్న బడుగు, బలహీన వర్గాలు, అల్ప సంఖ్యాక వర్గాలు, మహిళలు, శిశువుల సంక్షేమానికి ప్రవేశపెట్టిన 20 సూత్రాలు కార్యక్రమం ముఖ్య ఉద్దేశం దారిద్ర్య నిర్మూలన అన్నారు. ఈ సమావేశంలో జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి, జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్, డిఆర్వో బి.రామిరెడ్డి ఇతర శాఖల ఉన్నతాధికారులు పాల్గొన్నారు.




సమీక్షా సమావేశంలో సూచనలిస్తున్న తులసిరెడ్డి.

# ప్లేస్‌మెంట్‌ల కాలేజి ఆది-శంకర!



జిల్లాలోని వివిధ ఇంజనీరింగ్ కళాశాలల్లో అత్యంత ప్రతిష్టాత్మకమైన ఎన్‌బిఎ జాతీయస్థాయి గుర్తింపు పొందినది ఆది శంకర ఇంజనీరింగ్ కాలేజి. గూడూరుకు సమీపంలో ఏర్పాటు చేయబడిన ఈ కళాశాల 30 ఎకరాల విస్తీర్ణంలో స్థాపించబడింది. ఇసిఇ, ఇఇఇ, సిఎస్ఇ, సివిల్, మెకానికల్ ఇంజనీరింగ్‌తోపాటు ఎంసిఎ, ఎంబిఎ వంటి విద్యను అందిస్తుంది. విద్యార్థులకు గుణాత్మకమైన సాంకేతిక విద్యను అందుబాటులోకి తేవాలన్న ఉద్దేశ్యంతో 2001లో ఆది శంకర ఇంజనీరింగ్ కాలేజిని స్థాపించినట్లు ఛైర్మన్ వంకి పెంచలయ్య చెప్పారు. అన్ని కోర్సులకు నిష్ణాతులైన అధ్యాపక బృందాన్ని ఏర్పాటు చేయడంతోపాటు డిజిటల్ లైబ్రరీని విద్యార్థులకు అందుబాటులో వుంచామన్నారు. బాలికల కోసం ప్రత్యేకంగా గత ఏడాది నుంచి మహిళా ఇంజనీరింగ్ కాలేజిని స్థాపించామన్నారు. టిసిఎస్, విప్రో, ఇన్ఫోసిస్, ఐబిఎం వంటి సాఫ్ట్‌వేర్ సంస్థలతో అనుసంధానింపబడిన తమ కళాశాల నూరు శాతం ప్లేస్‌మెంట్ అందించే కళాశాలగా పేరుగాంచిందన్నారు. సదస్సులు నిర్వహించి విద్యార్థులకు వివిధ అంశాలపై అవగాహన కల్పిస్తున్నట్లు చెప్పారు.

# అద్భుత వయోలిన్ కచ్చేరి!

**గోమతి స్కూల్‌లో ఘనంగా కార్యక్రమం**



వయోలిన్ కచ్చేరీనిస్తున్న కన్యాకుమారి.

దేశంలో పేరుప్రఖ్యాతులు గడించిన కళాకారులను తమ స్కూల్‌కు పిలిపించి ప్రదర్శనలు ఇప్పించడం నెల్లూరు గోమతి స్కూల్ అధినేత అరుణకు ఒక అలవాటు. ఈ పరంపరలో భాగంగా 5వ తేది ప్రముఖ వయోలిన్ విద్వాంసురాలు ఎ.కన్యాకుమారితో వయోలిన్ కచ్చేరి నిర్వహించారు. కేరళలోని అనంత పద్మనాభస్వామి దేవస్థానంలో 29 గంటలపాటు నిర్విరామంగా తన సంగీత ఝురిని ప్రవహింపజేసి ప్రపంచ రికార్డును నెలకొల్పిన విదుషీమణి. కచ్చేరి ఆద్యంతం సభికులను ఆనందపరవశులను చేసింది. పురుషోత్తం కంజీర, గోపాలకృష్ణన్ మృదంగంపై ఈమెకు సహకారమందించారు. కచ్చేరి చేసిన కన్యాకుమారిని అరుణ, డాక్టర్ రాజశేఖర్ సత్కరించారు.

# అత్యున్నత ప్రమాణాల ఆర్ఎస్ఆర్ ఇంజనీరింగ్ కాలేజి!



జిల్లాలో పలు ఇంజనీరింగ్ కళాశాలలు వున్నా చక్కని విద్యాబోధనకు తోడు అత్యున్నత ప్రమాణాలతో నిర్వహిస్తున్న కళాశాల రామిరెడ్డి సుబ్బరామిరెడ్డి ఇంజనీరింగ్ కాలేజి. బోగోలు మండలం కడనూతల వద్ద జాతీయ రహదారిపై నెలకొల్పబడిన ఆర్ఎస్ఆర్ ఇంజనీరింగ్ కళాశాల విశాలమైన తరగతి గదులు, అత్యాధునిక హంగులు, నిష్ణాతులైన అధ్యాపక బృందంతో నడుస్తోంది. ఆధునిక సైన్సు లేబొరేటరీలు, కంప్యూటర్ ల్యాబ్, లైబ్రరీలను విద్యార్థులందరికీ అందుబాటులో వుంచడం ద్వారా మేధస్సుకు పదును పెట్టుకోవడానికి, విజ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి దోహదం చేస్తోంది. కళాశాల గురించి ఛైర్మన్ రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి వివరిస్తూ నాణ్యతతో కూడిన విద్యను గ్రామీణ ప్రాంత విద్యార్థులకందించాలన్న లక్ష్యంతో దీనిని స్థాపించామన్నారు. కళాశాలను నెలకొల్పిన నాటి నుంచి నేటి వరకు ప్రతి ఏడాది క్రమం తప్పకుండా యూనివర్శిటీ స్థాయిలో విద్యార్థులు ర్యాంకులను సాధిస్తున్నారని చెప్పారు. ఈ ఏడాది ఫైనలియర్ చదువుతున్న మొదటి బ్యాచ్ విద్యార్థులకు వివిధ సాఫ్ట్‌వేర్ కంపెనీల ద్వారా ప్రత్యేక శిక్షణనిప్పించి ఉద్యోగావకాశాలను కల్పించనున్నట్లు తెలిపారు.

## జగన్ పాపం పండింది

మొదటి పేజీ కొరవ

ఒక్క సిబిఐతో ఆగదది. సత్యం రామలింగరాజు కుంభకోణంలో వలె సీరియస్ ఫ్రాడ్ ఇన్వెస్టిగేషన్ బృందం రంగంలోకి దిగక తప్పదు. ఆ బృందంలో సిబిఐ ఒక భాగం మాత్రమే. ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్, నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజన్సీ, ఇన్‌కంటాక్స్ ఇంటెలిజెన్స్, రెవిన్యూ ఇంటెలిజెన్స్ వంటి విభాగాలన్నీ కలగలుస్తాయి. వారి దర్యాప్తు లోతులకు వెళ్తుంది. ఎక్కడెక్కడో కలుగులలో దాగిన ఎలుకలన్నిటినీ వెలికి తీస్తారు.

### మనీ లాండరింగ్ చట్టంతో ప్రమాదం

హైకోర్టు ఆదేశం ప్రకారం జగన్ మీద ఐపిసి, ప్రివెన్షన్ ఆఫ్ కరప్షన్, మనీ లాండరింగ్, విదేశీ మారక ద్రవ్య నియంత్రణ వంటి చట్టాలన్నిటిని ప్రయోగించి క్రిమినల్ కేసు నమోదు చేస్తారు. ఇందులో ప్రమాదకరమైనది మనీ లాండరింగ్ చట్టం. మారిషస్ దేశం నుంచి జగన్‌కు సంబంధించిన సండూర్ పవర్ ప్రాజెక్ట్‌కు, అక్కడ నుంచి సాక్షి పత్రికకు పెద్ద మొత్తంలో నిధులు వచ్చాయి. ఇవన్నీ ఇక్కడ నుంచి తరలించిన నల్లధనాన్ని తెలుపు చేసుకోవడానికన్నది బహిరంగ రహస్యం. ఇట్లా నల్లధనం, తెల్లధనం లావాదేవీలను విదేశాల ద్వారా జరిపించడం చాలా పెద్ద నేరం. జార్కండ్ ముఖ్యమంత్రి మధు కోడా రెండేళ్ల నుంచి జైలులో మ్రగ్గుతుండేది ఈ చట్టం వల్లనే. కరుణానిధి కుమార్తె కనిమొళి సమస్య కూడా ఈ చట్టమే. ఇప్పుడు జగన్ పాలిట కూడా ఇది పెద్ద ప్రమాదంగా పరిణమించబోతున్నది. దాన్ని తప్పించుకోవడం అసాధ్యం.

### జైలు తప్పదు కానీ ఆరునెలలు పడుతుంది

మారిషస్ నిధుల భాగోతంలో చిన్న ఆధారం లభించినా జగన్‌ను కటకటాల వెనక్కు పంపుతుంది సిబిఐ. కానీ ఆ దశకు దర్యాప్తు చేరుకోవాలంటే కనీసంగా ఆరు నెలల వ్యవధి పడుతుందని అంచనా. జగన్ కంపెనీలలో పెట్టుబడులు పెట్టిన కంపెనీల సంఖ్య దాదాపు 53. పెట్టుబడులను రాబట్టుకోవడం, కూడబెట్టుకోవడం, ఆస్తులు రిజిష్టర్ చేసుకోవడం కోసం జగన్ ప్రారంభించిన స్వంత కంపెనీల సంఖ్య దాదాపు 70 అని అంచనా. హైదరాబాదులో ఆయన కొత్తగా కట్టిన ఇల్లు, నాలుగు కంపెనీల పేరుతో వుందంటే, జగన్ ఎంత విచ్చలవిడిగా కంపెనీలను స్థాపించాడో అర్థం చేసుకోవచ్చు. ఇన్ని కంపెనీల వివరాలు, వాటి పేరుతో కొన్ని వందల బ్యాంకు ఖాతాలలో జరిగిన వేలాది కోట్ల రూపాయల లావాదేవీలు, అందుకు వాడుకొన్న వ్యక్తుల పేర్లు, వారి వివరాలు సేకరించాలంటే అంత సులభం కాదు. కొన్ని లక్షల కాగితాలు పరిశీలించవలసి వుంటుంది. అందుకోసం చార్టర్డ్ అకౌంటెంట్లను ఔట్ సోర్సింగ్ పద్ధతిలో తీసుకొంటున్నారు. వారి పరిశీలన పూర్తి కావడానికి ఆరు నెలల సమయం చాలా తక్కువ. ఆ పరిశీలన పూర్తి అయ్యి, తగిన సాక్ష్యాధారాలు లభించిన తర్వాత కానీ అరెస్టులనేవి జరగవు. అంత వరకు జగన్ స్వేచ్ఛగా తిరగవచ్చు.

### పెట్టుబడి పెట్టిన వారు గోడు గోడు మంటున్నారు

హైకోర్టు తీర్పు వల్ల జగన్ కంటే, ఆయన కంపెనీలలో పెట్టుబడి పెట్టిన పారిశ్రామికవేత్తలు ఎక్కువగా ఇబ్బంది పడ బోతున్నారు. వీరందరినీ ఈ కేసులో నిందితులుగా పేర్కొని విచారణ జరపబోతున్నది సిబిఐ. నిందితులు అంటే ఇంటరాగేషన్‌కు రావాలి. నిరూపణ జరిగితే జైలుకూ వెళ్లాలి. కార్పొరేట్ సామ్రాజ్యాలు స్థాపించుకొని, స్వంత విమానాలు హెలికాప్టర్లు కొనుక్కొని, మకుటం లేని మహారాజుల వలె సమాజంలో వెలుగొందుతున్న పారిశ్రామికవేత్తలకు, సిబిఐ కానిస్టేబుళ్ల ముందు చేతులు కట్టుకొని నిలబడవలసి రావడం కంటే హీనమైన పరిస్థితి వేరొకటి వుండదు. కానీ తప్పదు. వ్యాపార పరమపద సోపాన పటంలో వైఎస్ అనే నిచ్చెనను ఆశ్రయించి త్వరత్వరగా పైకి ఎక్కాలనుకొన్న వారంతా, ఇప్పుడు జగన్ అనే పాము నోట పడి పాతాళానికి జారిపోతున్నారు. వారి జాతకాలు తలక్రిందులై పోతున్నాయి. సిబిఐ ఒకసారి ఆఫీసుకు వచ్చి, కూపీ లాగడం మొదలు పెడితే జగన్ పెట్టుబడులకు పరిమితం కాదు. లోతులకు వెళ్తుంది. వ్యాపారం అన్న తర్వాత తప్పులు వుండక తప్పవు. అవి బయటకు వస్తే కంపెనీల అస్తిత్వానికే ముప్పు ఏర్పడుతుంది. పాపం వారంతా గోడు గోడున విలపిస్తున్నారు. నిద్రలేని రాత్రులు గడుపుతున్నారు.

### వారం జైలైతే హీరో అదే జీవితమైతే జీరో

ఈ కేసుల వల్ల జగన్ రాజకీయ భవిష్యత్తు ఎట్లా వుంటుంది అన్న ప్రశ్న ఒకటి సహజంగానే ప్రజలలో చర్చకు వస్తున్నది. నిజం చెప్పాలంటే పత్రికలు, ప్రతిపక్షాలు ఎంత గోల చేసినా ఇంతకాలం జగన్ అక్రమ ఆర్జన మీద జనం పెద్దగా పట్టింపు చూపలేదు. రాజకీయాలలో తినని వారెవరని వూళ్లో రచ్చ బండ మీద కూర్చుని ఎదురు సవాళ్లు విసిరే వారే ఎక్కువగా కనపడుతున్నారు. జగన్ అక్రమాల కంటే, వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేసిన వ్యక్తిగత ప్రయోజనాలకే జనం అధిక విలువ ఇస్తున్నారు. ఇప్పటి కేసును కూడా ప్రజలు అదే కోణంలో చూస్తున్నారు. సిబిఐ ఆయన్ను అరెస్టు చేసి వారం పది రోజుల లోపల బెయిల్ మీద విడుదల చేస్తే మాత్రం, జగన్ జనం దృష్టిలో హీరోగా ఎదిగిపోతాడు. వైఎస్ఆర్ కాంగ్రెస్ ప్రాభవం ఇప్పటికంటే అధికంగా వుంటుంది. కానీ ఆధారాలు బలంగా దొరికి, మధు కోడా, ఎ.రాజాల వలె నెలలు, సంవత్సరాలు జైలులోనే జీవితం గడపవలసి వస్తే మాత్రం రాజకీయంగా జగన్ భూస్థాపితమై పోతాడు. అంతకాలం జైలులో వున్న వాడిని జనం క్షమించక పోవచ్చు.

### దేముడున్నాడంటే అర్థం ఏమీ చేయలేని నిర్వేదమే

హైకోర్టు తీర్పు వెలువడగానే జగన్ పత్రికల వారితో మాట్లాడుతూ "దేముడున్నాడు, అన్నీ చూస్తున్నాడు" అని మాత్రమే చెప్పాడు. కేసులు, కోర్టులను చూసి జగన్ భయపడడం లేదని, నిబ్బరంగా వున్నాడని వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతలు చేస్తున్న ప్రచారం ఎంత బలహీనమైనదో ఈ మాటలతోనే అర్థమై పోతుంది. ఏమీ చేయలేని నిస్సహాయతలోనే ఎవరైనా దేముడున్నాడనే మాట అంటూ వుంటారు. జగన్‌ను కూడా ఆ నిర్వేదం ఆవహించిందన్నది నిజం. పైకి ఎంత బింకం నటించినా, తన పెట్టుబడులు అవినీతి విషనాగుల పుట్టలన్న నిజం ఆయన అంతరాత్మకు తెలుసు. పట్టించుకోనంత కాలం అవి సుఖాలనిస్తాయి. కానీ ఒకసారి చట్టం చెరకు చిక్కితే, పునాదులతో సహా కదలి పోతాయి. జైలుకు వెళ్లడం ఇక్కడ పెద్ద పరిణామం కాదు. ప్రజాధనం దోపిడీకి పాల్పడిన ప్రతిఒక్కరికీ శ్రీకృష్ణ జన్మస్థానం పుట్టిల్లుతో సమానం. దానికి జగన్ పెద్దగా బాధ పడతాడని అనుకోలేము. ఆయన సమస్యల్లా, ఇక నుంచి పత్రికను, పార్టీని ఎట్లా నడపాలి అన్నదే. సాక్షి ఇప్పటికీ నష్టాలలోనే వుంది. దాన్ని నిలబెట్టాలంటే కనీసం ఏడాదికొక వంద కోట్ల రూపాయలకు తక్కువకాకుండా మరొక రెండు మూడేళ్లు నష్టం భరించాలి. పార్టీ నిర్వహణ కూడా కోట్ల ఖర్చుతో కూడుకొన్న పని. ఇంతకాలం పారిశ్రామికవేత్తల నుంచి గతంలో రావాల్సిన పాత బాకీల వసూలుతో కాలం గడిచి పోయింది. సిబిఐ ఒకసారి వల విసిరిన తర్వాత ఏ పారిశ్రామికవేత్త, వ్యాపారి కూడా జగన్‌కు పైసా డబ్బు అందించాలంటే భయపడడం సహజం. ఆ పరిస్థితులలో జగన్ తన పార్టీని, పత్రికను ఎట్లా నడుపుతాడు అన్నది వేచి చూడాలి. జైలుకు వెళ్లి రావడం కంటే పెద్ద సమస్య ఈ ఆర్థిక బలం విషయంలోనే ఎదురుకాబోతుంది ఆయనకు.

---

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

దేశంలో కొన్ని వేలమంది ఐఏఎస్ అధికారులున్నారు. కానీ వారెవ్వరికీ దక్కని కీర్తి ప్రతిష్టలు అలెగ్జాండర్‌కు లభించాయి. 1980లో ఇందిరా గాంధీ ఆయన్ను తన వ్యక్తిగత కార్యదర్శిగా నియమించుకొన్నారు. ఆ తర్వాత రాజీవ్‌గాంధీ కూడా అదే స్థానంలో కొనసాగించారు. అలెగ్జాండర్‌కు నెల్లూరుతో అనుబంధం వుంది. మద్రాసు విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గా పనిచేస్తున్న సమయంలో ఆయన ప్రతిభ గురించి విన్న ఎసి సుబ్బారెడ్డి, 1941లో విఆర్ కాలేజి అధ్యాపకుడిగా రప్పించారు. ఇక్కడ ఆరేళ్ల పాటు పని చేశారాయన. ఇక్కడ నుంచే ఐఏఎస్‌కు ఎంపికైనారు. మేధస్సు, సమర్థత వున్నత ప్రమాణాలతో కూడిన నడవడికతో ఆయన కీర్తిప్రతిష్టలు తెచ్చుకొన్నారు. ఆయన మృతికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

---

## జనవాణి

2వ పేజీ కొరవ

తరబడి వున్న పచ్చని చెట్లను నరకడంపై 'జమీన్‌రైతు'లో వృక్షవిలాపం అంటూ వార్త వ్రాశారు. చెట్లు నరుక్కొంటూపోతే విపత్కర పరిస్థితులు ఏర్పడుతాయి. ఆంధ్రప్రదేశ్ వాటర్, ల్యాండ్ మరియు చెట్ల చట్టం – 2000 ప్రకారం చెట్లను నరకడం నేరం. విధిలేని పరిస్థితుల్లో కొట్టాల్సి వచ్చినా అనుమతి తీసుకొని కొట్టి, కొట్టిన చెట్టుకు బదులు రెండు మొక్కలు నాటి వాటి నిర్వహణకు అయ్యే ఖర్చును డిపాజిట్ చేయాలి.

*టి.కె.రెడ్డి* నెల్లూరు

# నెల్లూరీయుల మనసుదోచిన ఆదాల మువ్వలరవళి!

**● పోటాపోటీగా జరిగిన నృత్యాలను చూడను రెండు కళ్లు చాలలేదు.**

నెల్లూరు నగరంలో ఈనెల 4వతేది నుంచి 7వతేదీ వరకు నిర్వహించిన జాతీయస్థాయి కూచిపూడి నృత్యపోటీలు ఘనంగా ముగిశాయి. ఆదాల నృత్య కళాపీఠం ఆధ్వర్యంలో నిర్వహించిన ఈ పోటీలకు కస్తూర్బాకళాక్షేత్రం వేదికగా మారింది. మూడు విభాగాల్లో నిర్వహించిన ఈ పోటీలకు దేశం నలుమూలల నుంచి 50మందికిపైగా కళాకారిణులు పాల్గొన్నారు. "మువ్వల రవళి" పేరుతో తొలిసారిగా ఆదాల నృత్య కళాపీఠం ఆధ్వర్యంలో జాతీయ కూచిపూడి నృత్య పోటీలను నెల్లూరు నగరంలో ఏర్పాటు చేయడం అభినందనీయం.

బయట రాష్ట్రాల నుంచి వచ్చిన కళాకారులకు ఎటువంటి ఇబ్బంది లేకుండా నిర్వాహకులు అన్ని వసతులు కల్పించారు. సినీనటులు, పారిశ్రామికవేత్తలు, రాజకీయ నేతలు, అధికారులు సైతం కూచిపూడి నృత్య పోటీలను తిలకించారు. నాలుగు రోజులపాటు కళాక్షేత్రం ప్రేక్షకులతో కళకళలాడింది. సినీ నటి మంజుభార్గవి ఈ పోటీలకు సమన్వయకర్తగా వ్యవహరించారు. నృత్య ప్రదర్శనలిచ్చిన కళాకారిణులను న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన వారు నాట్యానికి సంబంధించిన ప్రశ్నలు అడిగి సమాధానాలు రాబట్టి అనంతరం విజేతలుగా ప్రకటించారు.

చివరి రోజున సినీనటి ముంజుభార్గవి బృందం చేసిన నృత్యం ప్రేక్షకులను బాగా ఆకట్టుకుంది. లలిత కళార్చన పేరిట ఆమె చేసిన ప్రదర్శనకు ఆడిటోరియం కరతాళధ్వనులతో మార్మోగి పోయింది. దాదాపు గంటన్నరకుపైగా సాగిన ఈ నృత్యం ఆహూతులను మంత్రముగ్దుల్ని చేసింది. ఆడిటోరియం పూర్తిగా ప్రేక్షకులతో నిండిపోవడంతో బయట అనేకమంది నిలబడి ఈ కార్యక్రమాన్ని వీక్షించారు. నృత్య ప్రదర్శన అనంతరం కళాపీఠం నిర్వాహకులు ఆదాల ప్రభాకరరెడ్డి ఇతర ప్రముఖులు మంజుభార్గవిని ఘనంగా సన్మానించారు.

ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ భారతదేశంలో కూచిపూడి నృత్యం ఆదరణ కోల్పోతున్న తరుణంలో ఆదాల నృత్యకళాపీఠం ఆధ్వర్యంలో "మువ్వల రవళి" పేరుతో ఈ పోటీలను నెల్లూరు నగరంలో నిర్వహించడం చాలా సంతోషంగా వుందన్నారు. ఈ పోటీలకు హాజరైన అతిధులు కూడా కూచిపూడి నృత్యం ప్రాధాన్యతను గుర్తించాలని కోరారు. దేశ సాంప్రదాయ నృత్యంగా పేరుగాంచినప్పటికి ప్రస్తుతం ఆదరించే వారు కరువయ్యారని వారి ఉపన్యాసంలో పేర్కొన్నారు.



మంజుభార్గవిని సన్మానిస్తున్న ఆదాల ప్రభాకర్‌రెడ్డి, వాకాటి నారాయణరెడ్డి, ఎస్పీ బి.వి.రమణకుమార్, కొండ్రెడ్డి రంగారెడ్డి తదితరులు.



మంజుభార్గవి నాట్యవిన్యాసం.

### విజేతలు

సబ్ జూనియర్ విభాగంలో వరంగల్‌కు చెందిన పూజకు ప్రథమ బహుమతిగా రూ.50వేల నగదు, స్వర్ణమయూరి అవార్డు అందజేశారు. ద్వితీయ బహుమతిని నెల్లూరు నగరానికి చెందిన అశ్రిత రెడ్డి, తృతీయ స్థానం వరంగల్‌కు చెందిన సిద్ధవైష్ణవిలు అందుకున్నారు. జూనియర్ విభాగంలో కేరళ రాష్ట్రానికి చెందిన స్నేహ ప్రథమ బహుమతి అందుకుంది. ఇందుకు 75వేల రూపాయల నగదు, స్వర్ణమయూరి అవార్డు బహుకరించారు. ద్వితీయ బహుమతిని వరంగల్‌కు చెందిన హర్షిణి 50వేలు, తృతీయ బహుమతిని నీలవేణి 30వేలు నగదు అందుకున్నారు. సీనియర్ విభాగంలో చెన్నైకు చెందిన కీర్తన, రాజమండ్రికి చెందిన లలిత సింధూరి ప్రథమ బహుమతిగా చెరి లక్ష రూపాయలు అందుకున్నారు. ముగింపు కార్యక్రమంలో ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి, జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, ఎస్పీ రమణకుమార్, పారిశ్రామికవేత్త రవి సన్నారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# జయప్రదమైన కామేశ్వరరావు మెమోరియల్ నాటక పోటీలు!

**● ఏటా రెండు సార్లు జరుపుతామన్న ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం**

స్నేహమేరా జీవితం, స్నేహమేరా శాశ్వతం అన్నాడో సినీ కవి. దీనిని అక్షరాల నిరూపిస్తున్నారు ప్రఖ్యాత సినీగాయకుడు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం. తన ప్రాణమిత్రుడు సుప్రసిద్ధ నాటకరంగ కళాకారుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి కామన్నగా అందరికి సుపరిచితుడైన స్వర్గీయ వై.కామేశ్వరరావు స్మృతిచిహ్నంగా వై.కామేశ్వరరావు పేరుతో నాటక కళాపరిషత్‌ను స్థాపించి గత 13ఏళ్లుగా క్రమం తప్పకుండా రాష్ట్రస్థాయిలో నాటక పోటీలను నిర్వహిస్తుండడం విశేషం. పరిషత్ అధ్యక్ష, కార్యదర్శులు వెన్నెలకంటి, శేషగిరీశం ఆధ్వర్యంలో విజేత ఆర్ట్స్ నిర్వహిస్తున్న ఈ నాటకపోటీలు ఈ నెల 4,5,6 తేదీలలో టౌన్‌హాల్ ఆవరణంలో జరిగాయి.

నాటక పోటీల ప్రారంభానికి ప్రముఖ సినీగేయ రచయిత భువనచంద్ర, సినీ దర్శకులు యోగి, మాటల రచయిత నెల్లూరీయుడు రాజేంద్రకుమార్ పాల్గొని ప్రసంగించారు. ఎవరైనా మరణిస్తే కొద్దిరోజులకే మరచిపోతున్న ఈరోజుల్లో తమ ప్రాణమిత్రుడు కామేశ్వరరావు జ్ఞాపకార్థం, ఆయనకెంతో ఇష్టమైన నాటకాలను ప్రోత్సహించాలన్న ఉద్దేశంతో మిత్రులందరు కలసి నాటక కళాపరిషత్‌ను స్థాపించి పోటీలు నిర్వహించడం అభినందనీయమని భువనచంద్ర పేర్కొన్నారు. నెల్లూరనగానే కళలు, కళాకారులు గురుకు వస్తారని అలాంటి సింహపురికి మిత్రుడి స్మృత్యర్థం నిర్వహించే నాటకపోటీలకు రావడం అదృష్టంగా భావిస్తున్నట్లు చెప్పారు. సినీరంగంలో చిత్రం విడుదలైతే మొట్టమొదటి టాక్ తెలుసుకొనేది నెల్లూరు నుంచేనన్న విషయాన్ని దర్శకుడు యోగి గుర్తు చేసుకొన్నారు. నెల్లూరు యాసలో ఆత్మీయత, అభిమానం వున్నాయని అందుకే ఆ యాసంటే తనకు ఎంతో ఇష్టమన్నారు.

పెదకాకాని వారిచే నీవు+నేను–ప్రేమ = పెళ్లి, కరీంనగర్‌కు చెందిన కళాకారుల చెల్లని పైసలు, నల్గొండ వారిచే అహం బ్రహ్మ, కాకినాడకు చెందిన కళాకారులచే ఒకటి ఒకటి ఒకటే, విశాఖ వారిచే ప్రదర్శిత మైన బొమ్మసముద్రం, కొలకలూరు వారిచే నెంబరులేని ఖైదీ, గుంటూరు వారిచే అంతాభ్రాంతే తదితర నాటకాలు నాటకరంగ ప్రియులను ఉర్రూతలూగించాయి. సందేశాన్నిచ్చే కథాంశాలతో రూపుదిద్దుకొన్న ఈ నాటక పోటీల్లో విజేతలకు బహుమతి ప్రదానోత్సవానికి ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం విచ్చేశారు. ఆయన మాట్లాడుతూ స్నేహానికి మరణం లేదని మనసా, వాచా నమ్ముతానని, పరిషత్ చివరి వ్యక్తి ఊపిరి వున్నంత వరకు నాటక పోటీలను నిర్వహిస్తామన్నారు. ఏడాదికోసారి మాత్రమే పోటీలు జరుపుతున్నామని, ఇకపై సంవత్సరంలో రెండుసార్లు వీటిని నిర్వహించనున్నట్లు తెలిపారు.

మూడురోజులపాటు జరిగిన నాటక పోటీల్లో ప్రథమ బహుమతి నెంబరులేని ఖైదీ, ద్వితీయ బహుమతి ఒకటి ఒకటి ఒకటే, తృతీయ బహుమతి నీవు+నేను–ప్రేమ=పెళ్లి కొచ్చాయి. ఉత్తమ దర్శకుడు, రచయిత, నటీనటులకు మెమెంటోలందజేయడంతోపాటు రంగస్థల నటుడు తిరుపతి హరగోపాల్, రచయిత బిజెకె మూర్తి, సంఘసేవకురాలు తోట శంకరమ్మలను సత్కరించారు. ఈ కార్యక్రమంలో నగర, రూరల్ శాసనసభ్యులు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఆనం వివేకానందరెడ్డి, వెన్నెలకంటి, శేషగిరీశం తదితరులు పాల్గొని ప్రసంగించారు. విజేత ఆర్ట్స్ ట్యాగ్‌లైన్‌లో వున్న విధంగా స్నేహానికి మరణం లేదు అన్న మాట ఈ నాటక పోటీలతో అక్షర సత్యం అయ్యింది.



ప్రథమ బహుమతి పొందిన నెంబరు లేని ఖైదీ నాటక ప్రదర్శన.



రచయిత బిజెకె మూర్తిని సన్మానిస్తున్న బాలసుబ్రహ్మణ్యం, జంట ఎమ్మెల్యేలు శ్రీధర్‌కృష్ణారెడ్డి, వివేకానందరెడ్డి.

# ధన్యవాదములు!

## ప్రియా సిమెంట్

నిర్మాణం వేగంగా, దృఢంగా, శాశ్వతంగా.

# 25

## సంవత్సరాలు

పూర్తి చేసుకుంటున్న శుభతరుణంలో వాటాదారులకు, ఖాతాదారులకు, డీలర్లకు, ట్రాన్స్‌పోర్టర్లకు, ప్రభుత్వ- ప్రైవేటు కాంట్రాక్టర్లకు, సంస్థలకు, రాష్ట్ర ప్రభుత్వానికి, శ్రేయోభిలాషులకు మరియు సిబ్బందికి కంపెనీ యాజమాన్యమువారి హృదయపూర్వక ధన్యవాదములు.




## రెయిన్ సిమెంట్స్ లిమిటెడ్

రెయిన్ సెంటర్, 34, శ్రీనగర్ కాలని, హైదరాబాద్-500 073

ఫోను: 040-4040 1234 ఫ్యాక్స్: 040-4040 1213

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com